# మిసిమి

మాస పత్రిక

సెప్టెంబర్, 1997

వెల - రూ॥ 6/-





# చిత్రకారుని గురించి



**మార్క్ షాగల్ 1887-1985**

మార్క్ షాగల్ 20వ శతాబ్దిలో అత్యం న ప్రముఖ క రుడు. సాధారణ యూదుకుటుంబంలో రష్యాలో లిటెబ్స్క్ పిటర్సబర్గ్‌కు, తరువాత పారిస్‌కు వెళ్ళడం ద్వారా, గ్రామీణ జీవిత ప్రభావం కొన్నాడు. స్ అతని రెండో జన్మభూమి అయింది అతని కళ ఎప్పుడు · యూదు లిక తాదాత్మ్యతనే ప్రదర్శించింది.

క

కా క

వ న్దం

షాగల్ చిత్రలేఖనంలో స్వైరకల్పన ప్రాముఖ్యాన్ని వహిస్తుంది. ఈ స్వైరకల్పన అతని అనుభవాలు, స్వప్నాలు, జ్ఞాపకాలు ఆధారంగా జనించిందే. స్వైర కల్పన ప్రతిమలు ఎప్పుడూ చిత్రకళలోద్యోతకం అవుతూనే ఉంటాయి. అయితే వాటిని పురాణాల ముసుగులో వ్యక్తీకరించడం ఇతనికి పరిపాటి. ఏది ఏమైనా పందొమ్మిదవ శ బ్ది సహజత్వ సంప్రదాయాన్ని వ్యతిరేకిస్తూ, స్వైరకల్పన ప్రాముఖ్యాన్ని వహించింది. కళాకారులు తమ అంతరంగ జీవి న్ని అభివ్యక్తీకరించడానికి తమ సొంత కాల్పనిక పురాణాలు తయారు చే సంప్రదాయక పౌరాణిక ఇతివృత్తాలను పునర్వ్యాఖ్యానించారు.

## ము తం

కన్యలతో ముడి త్వ ణిక ప్రతీక ఏకశ్ర ్ను ముఖచిత్ర దృ చూపు ంది

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 9 సెప్టెంబర్ 1997 సంచిక 8

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



---

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : "**ఏకశృంగాశ్వాలు**"

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

The Statesman

DELHI, FRIDAY, AUGUST 15, 1947.

## TO-DAY'S PROGRAMME IN DELHI

| | |
|---|---|
| 8-30 a.m. | Swearing in of Gover-nor- General and Minis-ters at Government House. |
| 9.40 a.m. | Procession of Ministers to Constitutent Assembly. |
| 9.50 a.m. | State Drive to Constitu-ent Assembly. |
| 9-55 a.m. | Royal Salute to Governor - General |
| 10-30 a.m. | Hoisting of National Flag at Constituent Assembly. |
| 10-35 a.m. | State Drive to Government House. |
| 6-00 p.m. | Flag ceremony at India Gate. |
| 7-00 p.m. | Illuminations |
| 7-45 p.m. | Fireworks display at Great place. |
| 8.45 p.m. | Official dinner at Government House. |
| 10-15 p.m. | Reception at Government House. |

## TOMORROW'S EVENTS

| | |
|---|---|
| 8-30 a.m. | Flag hoisting over Red Fort |
| 7.30 p.m. | Reception at Queen's Gardens. |
| 7-40 p.m. | Illuminations. |
| 8-30 p.m. | Fireworks display opposite Red Fort. |

## NEW CABINET FOR INDIAN DOMINION

The New Cabinet of the Union of India, which will function from August 15, announced on Thrusday night will consist of the following:

Pandit Nehru : Prime Minister; External and Common wealth Relations, Scientific Research.

Sardar Patel : Home, information and Broadcasting, States,

Dr. Rajendra Prasad: Food and Agriculture.

Maulana Abul Kalam Azad : Education.

Dr. John Matthai : Railways and Transport.

Sardar Baldev Singh : Defence.

Mr. Jagjivan Ram : Labour.

Mr. C. H. Bhabha : Commerce.

Mr. Rafi Ahmed Kidwai: Communications.

Rajkumari Amrit Kaur : Health,

Dr. B.R. Ambedkar: Law.

Mr R.K. Shanmukham Chetty : Finance.

Dr. Syama Prasad Mookerjee : Industries and Supplies.

Mr. N.V. Gadgil : Works, Mines and Power. — A.P.I.

## END OF INDIA OFFICE

LONDON. AUG 14-The Earl of Listowel, who on the stroke of midnight tonight (IST) will relinquish office as Britain's last Secretary of State for India, will fly to Balmoral, in Scotland, in order to hand over his seals of office to the King, who is now at his Scottish residence.

With the death of India Office tonight, the Secretaryship of State also ceases to exist, Lord Listowel, who has been occupying the dual office of Secretary of State for Burma and India, will continue to act as Secretary of State for Burma.

One of Lord Listowel's last acts as Secretary of State for India today was to prepare a message to the people of the new Dominions of India. and Pakistan - Reuter.

# ఇరవయ్యొకటో శతాబ్దంలోకి జాతివివక్షను రానీకండి

## నోబెల్ పురస్కార స్వీకృతి ప్రసంగం : డిసెంబర్ 8, 1986

**షొయ్ ఇంగ్ కా** – తెలుగులోకి సంక్షిప్తానుసరణ : గద్దె బుచ్చయ్య

బ్రిటిష్ సామ్రాజ్యవాద శక్తులు కెన్యాలోని మా- మా విమోచనా పోరాటాన్ని అణచివేయటానికి ఉద్యమకారుల్నీ, సానుభూతిపరుల్నీ వివిధ శిబిరాల్లో చిత్రహింసలు పెట్టారు. చంపారు. అలాంటి శిబిరాల్లో హోలా శిబిరం ఒకటి. ఇందులోని బందీలందర్నీ కొట్టి, చంపారు. కానీ, కలుషితమైన నీరు తాగబోతూండగా తాము ఆపబోయినా ఆగక దప్పికయిన బందీలు, ఆ నీరు తాగి మరణించినట్లుగా అధికారగణం సానుభూతి ప్రకటించి చేతులుదులుపుకుంది. ఈ కథనం ఘోరమైన అబద్ధమని సభ్యప్రపంచానికి ఋజువైంది. దీన్ని మేం నాటకీకరించాం. కానీ ఈ నాటకం మూలాన సాధించిందేమిటి. కుష్ఠురోగి తన కొరుక్కుపోయిన వేళ్లను ప్రదర్శించి ఆరోగ్యవంతుడి కరుణా తంత్రిని మీటి ధర్మాన్నర్థించినట్లు లేదూ?

సృజనశీలుడైన రచయిత మనస్సులో జరిగే తీవ్ర భావసంఘర్షణ అతనికి రెండు ప్రమాదాలను తెచ్చిపెడుతుంది. అతడు పూర్తిగా బండబారిపోవచ్చు. లేదా లేఖినీ సన్యాసం చేసి తనకు నచ్చని విషయాలకెదురొడ్డి పోరాడటానికి శక్తివంతమైన ప్రత్యక్షచర్యలకు దిగవచ్చు. హోలాలో జరిగిన ఈ ఘటన నా ఖండంలో ఏం జరుగుతోందో తెలిపే ఓ మచ్చుతునక. అలాంటివి మమ్మల్ని. నేరుగా ప్రభావితం చేస్తున్నాయి. ఇవి ప్రపంచశాంతికి ప్రమాదసూచికలు, జాత్యహంకారులు నల్లవారినేగాక నల్లవారిపట్ల సానుభూతి, సమర్థన చూపేవారిమీద కూడా పాశవికంగా వర్తిస్తారనే దానికి స్వీడన్ ప్రధాని ఓలాఫ్ పామే దారుణహత్య నిలువెత్తు సాక్ష్యం. ఒక వ్యక్తిని హత్యజేస్తే చాలు అతని భావాల్ని అరికట్టగలమనుకునే హ్రస్వదృష్టి అది. మోజాంబిక్‌ను దక్షిణాఫ్రికాకు వ్యతిరేకంగా యుద్ధసన్నద్ధం చేసిన మహానాయకుడు సమోరా మాచల్ విమాన 'ప్రమాదం'లో మరణిస్తే ఆయన వైరిగణం ఆనందోత్సవాలు జరుపుకున్నారు.

అమానుషమైన 'నేటివ్ పాస్ లా', దానిమీద వ్యతిరేకతా, వ్యతిరేకతను అణగదొక్కడానికి అవలంబించిన దమనకాండ మనం మరచిపోలేం. జాత్యహంకారుల దుర్మార్గం కాలంతో బాటు అధునాతన మౌతూ వస్తూ మరణాల సంఖ్య పెరిగేకొద్దీ, పీడితుల ఆత్మస్థైర్యం, బలం బహుగుణీకృతం కావడం చరిత్ర చక్షుర్గోచర మౌతూవుంది.

జాత్యహంకారులకు మానవత్వం లేదు. శ్వేత జాతేతరులు అసహ్యకరమైన జడపదార్థాలో, జంతువులో, చెట్లో, చేమలో తప్ప మనుషులుగా ఎన్నడూ వారికి కనపడలేదు. ఇంతకు ముందు సుఖశాంతులతో వర్థిల్లుతున్న రాజ్యాల్ని కూల్చి, వలసలు స్థాపించుకుని శతాబ్దాల తరబడి కొనసాగిన నాగరికతను నాశనం చేయడమే వాళ్ల ధ్యేయం. ప్రపంచాన్ని నాగరికం చేసే ఉద్యమాన్ని

---

★ **గద్దె బుచ్చయ్య** గుంటూరు హిందూ కళాశాలలో ఆంగ్లశాఖలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

చేపట్టామని వాళ్లు పొగరుగా ప్రకటించుకోవడానికి, తాము తప్పితే మిగతావాళ్లెవ్వరూ నాగరికులు కాదనే భావం వారిలో బలంగా పాదుకుని వుండటమే కారణం.

శ్వేతజాతీయ మేధావివర్గంలో అధికశాతం ఆఫ్రికన్ల పట్ల నిర్లిప్తంగా వుంది. నల్లజాతిపై సానుభూతి చూపిన మానవతావాదుల్ని అనేకవిధాలుగా అంతంజేసిందీ జాత్యహంకారం. రూత్‌ఫస్ట్ లెటర్ బాంబ్ పేలి దుర్మరణం పాలయాడు. ఆంద్రీ బ్రింక్, ఆబ్రమ్ ఫిషర్, హెలన్ సుజ్మన్, బ్రేటన్ భాష్ ఇంకా ఎందరో మానవతావిలువల్ని కాపాడే యజ్ఞంలో సమిధులుగా ఆత్మ సమర్పణ చేసుకున్నారు. ఇంకెందరో ఇప్పుడూ జాత్యహంకారానికి సర్వస్వం ఎదురొడ్డి పోరాడుతూనే వున్నారు. కేవలం సాహిత్యం, కళారూపాల ద్వారా జాతివివక్షా విముక్తి లభించదు. స్వజాతివ్యామోహంలో బందీలైన వారినీ, నిర్లిప్తతతో వున్నవారినీ, ఉద్దేశించి మాట్లాడాలనుకుంటున్నాను. జాగృతం చేయాలను కుంటున్నాను. ''పోలండ్ బ్రతకాలి'' అని ఘోషించే దయామయుడు ''నికరాగ్వాకూడా బ్రతకాలి'' అని గర్జిస్తే, ఏదో బూతువిన్నట్లు చెవులు మూసుకుంటాడు. ఇది హేయాతిహేయమైన రెండు నాలుకల ధోరణి.

ప్రకృతి మారుతున్నా కాలం ఘనీభవించిపోయింది. చారిత్రక భయాన్నీ, అభివృద్ధినీ తనలో దాచుకుని గడ్డకట్టుకుపోయింది. ఈనాటి ఈ నోబెల్ సాహిత్య సీకృతీ సంఘటన - కాలంలో గడ్డకట్టిన ఆభయాన్ని తొలగించగలదా? ఒక నీగ్రోజాతీయుడికి ఇలాంటి సన్మానం అసాధ్యం అని నిరూపించాలనే మీ ఆరాటం ఎన్ని లక్షలమందిని హతంచేసిందో, అంగవైకల్యానికిగురిచేసిందో, హింసపాల్జేసిందో, నోరునొక్కిందో, దేశబహిష్కృతి విధించిందో, మానవత్వాన్ని హరించిందో? ఆ అభాగ్య మేధావులంతా నా చాయ చర్మం వారే. నా వెంట్రుకల లాంటి వెంట్రుకల కిరీటాల వారే. ఎంతమంది గుండె మార్పిడి చికిత్సలు చేయగల నిపుణులు ఈ అమానుష జాతి వెలి రక్కసికి బలయ్యారో. మీరు బహుళజాతి సమాజపు విలువను గురించి ప్రపంచానికి నచ్చ జెప్పివుంటే ఈ సరికి ఎంతమంది నల్లజాతీయులు ఈ నోబెల్ వేదికపై నిలబడి వుండేవారో?

ఆఫ్రికన్ నాయకులు సామ్రాజ్యవాదపు భయంకర ఫలితాల ననుభవించినా, ఎంతో ప్రాణ నష్టాన్ని చవిచూసినా, చరిత్రనుంచి స్పష్టమైన పాఠాల్ని నేర్చుకోలేకపోయారు. పైగా తామే నయా సామ్రాజ్యవాదులుగా మారిపోయారు. ఇంగ్లండు వలసవాదాన్నీ, సామ్రాజ్యావాదాన్నీ పుణికిపుచ్చుకున్నారు. దీనికి బదులు వాళ్లు దురాక్రమణకూ, జాతి వివక్షకూ, వంచకత్వానికీ వ్యతిరేకంగా పోరాడి, వుంటే, ఎన్నో ప్రకృతి వనరులతో సుసంపన్నమైన ఆ సువిశాల ప్రాంతంలో నూతన ప్రపంచాన్ని సృష్టించి వుండేవారు. కానీ వీలుచిక్కినప్పుడల్లా వాళ్లు గడియారాన్ని వెనక్కితిప్పారు. బ్రిటిష్ వలసవాద పరిపాలన నుంచి కోటిమంది స్థానికుల్ని స్వాధీనంచేసుకుని, శతాబ్దంపాటు పోరాడి వాళ్లు సాధించుకున్న హక్కుల్ని సైతం వాళ్లకు లేకుండా కాలరాచారు. బానిసత్వ సంకెళ్లను మరింత గట్టిగా బిగించారు.

ఈ శతాబ్దపు ప్రపంచం వేగంగా ప్రగతి దిశగా పయనిస్తోంది. పకృతి, అంతరిక్షాల సార్వ భౌమాధికారాన్ని నిలవరిస్తోంది. వాటిశక్తుల్ని మచ్చికచేసుకొంటోంది. స్వాధీనంచేసుకొంటోంది.

తప్పులు చేసింది. దిద్దుకుంది. పరాజయాల్లో అంతరాత్మ ప్రబోధాన్ని విన్నది. వక్రీకరించ బడ్డ అవకాశవాద చరిత్రను క్షాళనం చేసి సత్యానిబద్ధం చేసింది. ఈ నేపథ్యంలో ఇతరుల చరిత్రను వక్రీకరించి విషపూరితం చేసేవారు తాము చేసిన ద్రోహం తమ చారిత్రక ప్రగతినే అడ్డుకుంటుందని గ్రహించి, తమ తప్పుల్ని కప్పిపుచ్చుకునేందుకు పిసినితనంగా చిన్న చిన్న తాయిలాలివ్వడం మొదలేశారు. బలమైన ఆనకట్టుకు పడినగండి చిన్నదైనా కాలక్రమేణా మహోద్ధృతమై ఆనకట్టను పెళ్లగించుకుపోక మానదు. అలాగే ఈ జాత్యహంకార సంస్కృతీ చరిత్ర కూడా.

ఆఫ్రికాదేశాలకున్న సంప్రదాయం, నాగరికత, సంస్కృతి, కళలు ప్రాచీనమైనవి. పురావస్తు సాక్షాలూ, ప్రాచీన వ్యాపారుల భోగట్టాలూ ఈ విషయాల్ని సుప్రతిష్ఠితం చేస్తున్నాయి. అయితే ఈ సత్యాల్ని తారుమారు చేసి హెగెల్, లాక్; మాంటెస్క్యూ, హ్యూమ్, వోల్టెయర్ మొదలైన యురోపియన్ తత్త్వవేత్త లెందరో నిర్లజ్జగా జాత్యహంకార సిద్ధాంతాలను ప్రచారం చేశారు. ఇక విప్లవ వర్గపోరాట సిద్ధాంతవేత్తల సిద్ధాంతలోపాల్ని, వారి సమాజంలో దోపిడీని అంతంజేద్దామనే వాళ్ల ఉదాత్తాశయాన్ని గుర్తించి, దయతో క్షమించి వదిలివేద్దాం.

---

షోయ్ ఇంగ్ కా 13 జూలై 1934లో పశ్చిమ నైజీరియాలో శామ్యూల్ అమోడెలె షోయ్ ఇంగ్ కా, గ్రేస్ ఇనియోలా షో ఇంగ్‌కాలకు రెండో సంతానంగా జన్మించాడు. 1957లో ఆనర్స్ పట్టం పుచ్చుకొన్నాడు. తరవాత M.A. చేయాలనుకొంటూ, రెండు ముఖ్యమైన నాటకాలను, "The Swamp Dwellers" and "The Lion and the Jewel" రాయనారంభించాడు. అవి అనేక సార్లు లండన్‌లో ప్రదర్శితమయ్యాయి. 1960లో రాక్‌ఫెలర్‌పరిశోధనవేతనాన్ని అందుకుని ఇబదన్ విశ్వవిద్యాలయ కళాశాలలో నాటకాభ్యసనం చేశాడు. 1965 లో లాగోస్ విశ్వవిద్యాలయంలో సీనియర్ లెక్చరర్ అయ్యాడు. తిరుగు బాటు దారులతో చేతులు కలిపాడన్న ఆరోపణతో నైజీరియా సివిల్ వార్ సందర్భంలో అరెస్టు అయ్యాడు. "Poems from prison" (1969) పద్యాలు, "Season of Anomy" అనే నవల (1973), "madmen and Specialists" అనే నాటకం (1974) రాశాడు. 1986 లో అందుకున్న నోబెల్ బహుమతే కాక ఇంకా అనేక బహుమతులను అందుకున్నాడు. 1994 సెప్టెంబరులో నైజీరియా అతని పాస్‌పోర్టును తీసేసుకొంది. గృహ నిర్బంధానికి భయపడి ప్రవాసం వెళ్ళిపోయాడు.

''కవితా ప్రతిధ్వనులతో సుసంపన్న సువిశాల సాంస్కృతిక దృక్కోణంతో అస్తిత్వాన్ని నాటకీయంగా ప్రతిబింబించినందుకు.''

సంపాదకుడు

---

అసంగతమైన, ఆత్మహత్యా సదృశమైన వర్తమానాన్ని అర్థంచేసుకోవాలంటే మనం గతాన్ని అవగతం చేసుకోవాలి. చారిత్రక అసత్యాలే వినాశక శక్తులకు బలం అని వర్తమాన ప్రపంచానికి తెలియజెప్పాలి. వంచనకు, కుతంత్రాలకు బలైన మనం ఈ ప్రపంచాన్ని పాపపరిహారం చేసుకోమని నిలదీయాలి. వట్టిమాటలు కట్టిపెట్టి, గట్టిమేలును తలపెట్టమని నిగ్గదీయాలి. భయంకరమైన అమానుషత్వాన్ని పెంచి, ప్రోదిచేసే తల్లిగా వుండవద్దని నచ్చజెప్పాలి. సాగరాల మీదుగా, అంతరిక్షం

ద్వారా వచ్చే సాంకేతిక సాయాన్ని నిరాకరించండి. ఈ తరహా ఆర్థికదిగ్బంధనం జాత్యహంకారానికి చరమగీతం పాడుతుంది.

జాతివివక్షను నమ్మే దక్షిణాఫ్రికాలోని సభ్యజనబాహ్య సమాజం మానవ మేధాశక్తితో చెలగాటాలాడుతూంది. ప్రపంచం సర్వం నెల్సన్ మండేలాను వెంటనే విడుదులజేయాలని విజ్ఞప్తి జేస్తే ఆ దేశం, ''మిత్రరాజ్యాలు నాట్సీ నరహంత రుడోల్ఫ్ హెస్‌ను ఎందుకు బంధించివుంచారో, మండేలాను అందుకే బంధించి వుంచుతున్నామ'' ని చెప్పటం జాతి వివక్షను దాచుకోడానికి చేసిన క్రూరమైన ప్రయత్నాల కిది పరాకాష్ఠ. జాతివివక్షావాదులు దేన్ని నిందిస్తున్నారో, అవమానిస్తున్నారో, దాన్ని నేను హార్దికంగా సొంతం చేసుకుంటున్నాను. అందుకే నాకీ సత్కారం. నా జాతీయతతో కూడుకున్న జీవితం నా అస్తిత్వం. అతి స్వయంసంపూర్ణం. సృజనశీలం. దానికి ఇతరుల దగ్గఱకు వెళ్లడానికీ, ఇతరులను దగ్గఱకు రానీయడానికీ ఏ భయం లేదు. దాంతోనే శత్రువు నర్థంచేసుకుని, వాణ్ణి నిరాయుధుణ్ణి జేసే మార్గాలాలోచిస్తాం.

అనాగరిక దుండుగ దుండుల బారినుండి నాగరికతను రక్షించడానికి ప్రయత్నిస్తున్నామని పదేపదే ప్రపంచానికి వాక్రుచ్చే దక్షిణాఫ్రికా ప్రకటనలు మాకు హాస్యాన్ని కలిగిస్తున్నాయి. అవి ఆ జాత్యహంకార ప్రభుత్వం తన విధానాల్ని సమర్థించుకోటానికి వినా మరే తర్కానికి నిలవలేవు. కొందరు ఆఫ్రికన్ నాయకుల్నీ, మతిస్థిమితం తప్పిన కొంతమంది వ్యక్తుల్నీ, మరికొందరు దొంగ వ్యాపారుల్నీ బూచిగా చూపించి మమ్మల్ని రక్షిస్తున్నామనే వృథాప్రదర్శన చేస్తున్నారు. వాళ్లు శత్రువులే. కానీ వాళ్లను తరిమివేసి వీళ్ళు చేసిందేమిటి? వీళ్ళు రాకపోతే వాళ్లని మాకు చేతైనప్పుడు త్రోసిపారేసే వాళ్లం.

ఇంతేగాక నా ఖండవాసులు ప్రపంచవిజ్ఞానానికేమాత్రం దోహదం చేయలేదని వాళ్ల ఆరోపణ. ఈవేమి శతాబ్దాల ఐరోపా నాగరికతను స్వీకరించి, వ్యర్థాన్ని బహిర్గతం చేస్తూందనే వాదనలో పసలేదు. కాలంచెల్లిపోయిన యూరో-యూదు విశ్వాసాలను పట్టుకువేళ్లాడే వీళ్లు ప్రగతికీ, అభ్యుదయానికీ ప్రతినిధులని ఎలా చెప్పుకోగలరు; టెస్టమెంటరీ గాడిజం ఆధారిత జాతివివక్షావిధానం వీళ్లమతమే అయితే దాన్ని క్రైస్తవం అనే ధైర్యం నాకు లేదు. క్రైస్తవంలోని కరుణ, అనుకంప, ప్రేమ వీళ్లు మతం అనుకునే దాన్లో లేనేలేదు. వలసవాద పూర్వచరిత్ర సమస్తం రక్తసిక్తం. క్రూసేడ్లూ, జిహాద్‌లతో అనేక నాగరికతల నంతరింప జేసాయి. కంటికి కన్పించని దేవుళ్ల కోసం ఎన్నో సంస్కృతులు నేల మట్టమయ్యాయి. ఇది ఈ రోజుకీ మారలేదు. ఇలా అంధయుగం కొనసాగుతూంది.

ఒకదేశంలోని ప్రభుత్వం ఆ దేశంలోని అధికసంఖ్యాక ప్రజలపై ఆధిపత్యం చెలాయించటానికి, ''భగవంతుడే కొన్ని జాతుల్ని శ్రేష్ఠులుగా సృష్టించాడ'' ని ప్రచారం చేస్తూంది. జాతీయుత ప్రమాణంగా అంతర్జాతీయ సంబంధాలుండవలసిన ఈ ప్రపంచానికి ఆ ప్రభుత్వం ప్రమాదకారి. నేటి ప్రపంచంలో అలాంటి సమాజం ఉండటం అసహజం. మాకూ పురాణగాథలున్నాయి. వాటిని మేం ఏనాడు ఇతరజాతుల్ని బానిసలుగా చేసుకోడానికి మలుచుకోలేదు. మనం బ్రతికేది

క్రోధమూ- దయ; స్వేదమూ - కన్నీరు; ఓటమి - ప్రతిదాడీ ........
షాయ్ ఇంగ్ కా అక్షరానికి రెండంచులు. ఆ నిశితాభివ్యక్తికి ఓ ప్రతికలా ఈ కవిత!

# టెలిఫోన్ తీగల్లోంచి ...... వర్ణావర్ణాలుగా కొన్ని మాటలు !

ఏ మంత ఖరీదు కాదు. స్థలమూ
ఫర్వాలేదు. నిక్కచ్చిగా చెప్పిందా యజమాని
తానిక్కడ ఉండనని. ఏమీ మిగల్లేదు
కాసింత తర్జన తప్ప. 'చూడండీ!' హెచ్చరించాను
'వృధా ప్రయాసలంటే నాకు అసహ్యం - నేను ఆఫ్రికన్‌ని'
నిశ్శబ్దం. మొహమాటపు మర్యాద
నిశ్శబ్దంగానే పాకి. స్వరం
పెదాల రంగు పులుముకొన్న, పొడవైన సిగిరెట్ పైపు
పసిడి పూతల స్వరం. దొరికిపోయానిప్పుడు
'ఎంత నలుపు?' వినడంలో పొరబడలేదు 'కాస్తంత చామన చాయా?
లేక కారు నలుపా?' రిసీవర్ పెట్టేస్తే! నేరపూగాలి దుర్గంధం
దోబూచులాటల ఈ మాటల్లో దుర్వాసనల శ్వాస.
ఈ ఎరుపురంగు ఇరుకు బూత్, ఎరుపెరుపు తపాలా పెట్టె, రెండు మడతల
ఎర్రబస్సు, ఒత్తుకుపోతూ, రోడ్డుపై విస్తరిస్తూ మెత్తని తారు. అంతా వాస్తవ-
అమర్యాదకర నిశ్శబ్దంలో అవమానం, ఓటమి
దిగ్భ్రాంతిమయ మౌనాన్ని తోస్తోంది ముందుకు క్లుప్తతకై ప్రాధేయపడమని.
కొడవలి అంచు ప్రశ్నల మీద ఉచ్చారణ భారాన్ని కాస్త మార్చిందా జాణ
'కాకి నలుపా? చామనచాయా నువ్వు?' తేరుకున్నాను.
'పాలిన రంగా లేక పాలు కలిసిన చాక్లెట్ వర్ణమా అనో...'
ఉద్వేగరహితం ఆమె ఒప్పుకోలు, అల్పమైన తన
అనిర్దేశికత్వంలో అది నలిగిపోతుంది. ఇప్పుడు పరస్పర సంబంధం
అనుకూలంగా మార్చుకుంది కవళిక. ఇక నావంతు
వెల్లువలా ముంచెత్తాను ప్రతిగా. 'పశ్చిమాఫ్రికా ముదురు గోధుమ రక్తకణం నాలో'
వర్ణావర్ణ విశ్లేషణల పురికొస తనకి అందడం కోసం కాసేపు నిశ్శబ్దం,
ఆమె స్వరంలో గణగణ ప్రకంపనలతో సత్యం మోగేంతవరకు -
'అదేమిటి' లొంగు 'బాట' లోనే
'తెలియదు అదేమిటో?' ..... 'చిక్కని నీరుకావి రంగు'
'చిమ్మ చీకటి నలుపు కాదా అది?' 'మొత్తం కాదు,
ముఖమే ఆ ముదురు గోధుమ .... కానీ నా మిగతా దేహమంతా
మేడమ్! మీరు తప్పక చూడాలి. అరిచేతులు, నా కాలి మడిమలు
విరిచిన పసుపుకొమ్ము వర్ణం. బుద్ధి తక్కువై కింద కూర్చొని కూర్చొనీ
నా పిర్రలు మాలకాకి రంగుకు తిరిగాయా రాపిడికి
మరొక్క మాట...' - ఆమె రిసీవర్‌ను ఉరుము చప్పుళ్లకి
అన్చిన భ్రాంతి నా చెవులకి -
'మేడమ్' వేడుకున్నాను, 'మీరు మీరుగా
మీ కోసం చూడలేరా దేన్ని?'

స్వేచ్ఛానువాదం : **నరేష్ నున్నా**

కాల్పనిక ప్రపంచంలో కాదు - వాస్తవ ప్రపంచంలో. ఆఫ్రికన్ జీవితం, సంస్కృతీ, తత్త్వశాస్త్రం ఈ జాత్యహంకారుల తాతముత్తాతల్ని, వాళ్ల దేశాల్లోనే గాఢంగా ప్రభావితం చేశాయనీ, వాళ్ల వుద్యమాలకి వూపిరిగా నిలిచాయనీ ఈ జాత్యహంకారులకు గట్టిగా తెలియ చెప్పాలి. కొత్తదనాన్నన్వేషిస్తూ అనేక సాంస్కృతిక సాహసాలు చేసిన శ్వేతజాతీయులకు తమజీవితంలోని, యాంత్రికతనుంచి సాంత్వనకావలసి వచ్చింది. స్వీయనాగరికతా ఘనవిజయాలనుంచి సమాజానికి సంక్రమించిన అంతు బట్టని రుగ్మతను నయంజేసుకునేందుకు జీవితానికి కొత్త నిర్వచనాలు కావలసివచ్చాయి. వాటికోసం అన్వేషణ ఆఫ్రికా ప్రపంచదేశాల కిచ్చిన కానుకల్లో కనిపించింది. దాంతో వీళ్లు ఆఫ్రికన్ జీవితాన్ని ఆరాధించటం మొదలైంది. అయితే, ఆ ఆరాధనలో ద్వైధీభావం. ఆఫ్రికన్ జీవితం పట్ల ఆరాధన, ఆఫ్రికన్ జాతిపట్ల అసహ్యం. అద్వైతంగా వుండి తమ వ్యక్తిత్వాన్ని పూర్తిగా కోల్పోయి, ఆఫ్రికన్ విలువలతో జీవితాన్ని పునర్నిర్వచించుకోవాలనే తపనతో దరిజేరిన శ్వేతజాత్యహంకారులకి' తనను తాను తెలుసుకుంటే చాలునన్న సంతృప్తితో జీవించే ఆఫ్రికన్ జాతి ఆత్మ అవగతమైనట్లు అగుపించదు. ఆఫ్రికన్ జీవన విధానం, సంస్కృతీ, కళలూ ఘోర వక్రీకరణలకు గురయాయి. ఆఫికన్ కళాఖండాల్ని మెచ్చుకున్న శ్వేతజాతీయుల ఆకళ్లే ఆ కళారూపాల్ని సృష్టికర్తల పైకి విచ్చుకత్తుల్ని విసిరాయి. ''మీరు సృష్టించిందైనా అందమైన వస్తువును అట్టిపెట్టుకునే అర్హత మీకు లేదు గనుక మేం దాన్ని గుంజుకోవచ్చు'' అనే సిద్ధాంతం వున్న జాతి అది.

ఆఫ్రికన్ కళలు, సంగీతం, నాటక సంప్రదాయాలను లోగొన్న యూరోపియన్ అభివ్యక్తవాదోద్యమం ఒకదానికొకటి ఏమాత్రం సంబంధంలేని, సఖ్యతలేని, పరస్పర విరుద్ధమైన భావసంచయాలు, సామాజిక ధోరణులున్న ఫ్రాయిడ్, కార్ల్ మార్క్స్, బకూనిన్, నీట్షే, కొకెయిన్, స్వైరప్రణయం లాంటి విషయాల్నీ ప్రభావితం చేసింది. వందేళ్ల వయసొచ్చిన దీన్ని వెఱ్ఱిగా ఆరాధించే జొవానిజ్ బెచర్ విస్మృత ఉన్మాదంలో ''నీగ్రో జాతులు, జ్వరం, క్షయ, సుఖరోగోత్పాతాలు, మేధో సంబంధ మానసిక వైక్లబ్యాలు వీటన్నిటితో పోరాడుతాను, ఓడిస్తాను గూడా'' అని అరిచిన పాలికేక నాజాతిని ఏ అసహ్యకరమైన స్థాయికి దిగజార్చి, అభివ్యక్త వాదోద్యమాన్ని కూడా ఓ దిశావిహీనమైన, అసంబద్ధ, వ్యర్థమైన దాన్నిగా చేసిందో గమనించవచ్చు.

నల్లజాతీయుల క్షమాశక్తి నుంచి ప్రపంచం ఒక ముఖ్యమైన పాఠాన్ని నేర్చుకోవాలి. ఆ క్షమాశక్తికి ఆధారం ఆజాతికున్న ప్రాపంచక దృక్పథం, మత విశ్వాసం. ఇతరమతాలూ, జాత్యహంకార భావాలూ ఆ క్షమాశక్తి నింకా పూర్తిగా సమసేట్లు చేయలేదు. నల్లజాతిని నీచాతినీచంగా చిత్రించి, అసహ్యించుకున్న ఫాబినియస్, పైకి ఆఫ్రికా సంస్కృతి కెంతో ఉపకరించినట్లు కనిపించినా, ఆఫ్రికా కళాఖండాలను యూరపుకు తరలించిన దారుణమైన బందిపోటుదొంగే! అనేక కళాఖండాల్ని యూరప్ మ్యూజియాలకు తరలించినా, అలా తరలించడం వలన ఆఫ్రికాను, దాని సమాజాన్ని, సంస్కృతిని ఇతరులు అర్థంచేసుకోడానికి దోహదంచేశాడు. అందుకే అతని జ్ఞాపకార్థం మేధావుల గోష్ఠులు, సమావేశాలు జరుగుతూనే వున్నాయి. అతనిలో ఎన్నిలోపాలున్నా క్షమించి, అతననుకోకుండా చేసిన మేలును గుర్తుంచుకోడం ఆఫ్రికా క్షమాగుణాన్ని ప్రస్ఫుటంగా చూపడం లేదూ! వలసపాలకదౌష్ట్యం పనిలో లక్ష్యాన్నందుకొని

స్వదేశీయుల చేతులు, ముక్కు-చెవులు తెగకోసే అమానుషానికి పాల్పడినా జాతివివక్షకి సహనమే లభించింది. అశేషప్రాణార్పణాలనంతరం స్వాతంత్ర్య సాధించిన నల్లజాతి తమ పీడకుల్ని తమతో ప్రభుత్వాధికారాన్ని పంచుకోనిస్తూంది. కృష్ణఖండపు క్షమాగుణానికిది నిదర్శనం కాదూ? అదే ఇతరజాతుల దురాక్రమణలో వున్న యూరోపియన్ దేశాలు, పరపరిపాలన ముగిసి శతాబ్దాలు గడిచిపోతున్నా, గతాన్ని మరచిపోక భయంకర ప్రతీకారాన్ని తీర్చుకుంటున్నాయి. హెచ్చరికా చిహ్నాలుగా బానిసత్వవశేషాలను వస్తు ప్రదర్శనశాలల్లో, సామూహిక పూజామందిరాల్లో భద్రపరుచుకుంటున్నాయి. చరిత్ర పునరావృతం కాకుండా ఎరుక కలిగించే వుద్దేశ్యంతో - ఈ విషయంలో ఆఫ్రికాకు, యూరప్ దేశాలకు ఎంత తేడా?

పరాయిపాలన అంతరించిన తరవాత ఆ అల్పసంఖ్యాక పరాయి జాతి సాంస్కృతిక, జాతీయ గౌరవాన్ని తగ్గించే చర్యలకు నల్లజాతి ఎన్నడూ పూనుకోలేదు. ఒకనాటి తమ స్వేచ్ఛాస్వాతంత్ర్యాన్ని హరించి. ధన, మాన, ప్రాణాల్ని బలితీసుకున్న జాత్యహంకారుల పేర్లూ, విగ్రహాలూ దేశంలోని వివిధ వూళ్లలో, వీధుల్లో వున్నా తొలిగించకుండా నల్ల వారు వాటిని అలంకారాలుగా పరిగణిస్తూనే వున్నారు. వారిగ్రంథాలయాల్లో నల్లజాతి వ్యతిరేకులైన ఫ్రొబీనియస్, హ్యూమ్, హెగెల్, మాంటెస్క్యూల పుస్తకాలు బహిష్కరణకు గురికాలేదు.

ఈ సర్దుబాట్లను చూసి నల్లజాతి ఓర్పుకు ఆలోచనలేదని, అంతంలేదని భావించగూడదు. ఆ సర్దుబాట్లు ఇతరులకు పరీక్షలు. అవి పెరిగిన కొద్దీ ఇతరుల రుణం పెరుగుతుంది. వాటికి సమానమైన పరిహారాన్ని ఇతరులు చెల్లించితీరాలి. లేకపోతే పెనుముప్పే. మాకు పరీక్షాకేంద్రం. దక్షిణాఫ్రికా బైబిల్‌ల్లో అభివర్ణించిన నరకయాతనలకీ, భయాలకీ అదే కేంద్రం. అదింకా మధ్యయుగాల్లో వుంది. ప్రపంచంలోని శాంతికాముకులంతా ఒక దృఢ నిర్ణయం తీసుకోవాలి. దాన్ని ఆధునిక మానవతా సమాజంలోకి తీసుకురావాలా, వద్దా అనే విషయాన్ని తేల్చుకోవాలి. అలా సభ్యమానవ సంఘంలోకి దాన్ని తీసుకురావడం అసాధ్యమైతే, దాన్ని వెలివేసి, ఆ దేశంలోని అధికసంఖ్యాక నల్లజాతీయులతో పటిష్టమైన వ్యూహం పన్ని, ఆ వ్యవస్థను అంతర్గతంగా కూలిపోయేలా చేసి పాదాక్రాంతం చేసుకోవాలి. మీరే మార్గాన్నెనుకునైనా సరే ఈ అమానుషావమానాన్ని ఇరవయ్యొకటో శతాబ్ద చైతన్య స్రవంతిని కలుషితం చేయకుండా నిరోధించాలి. కొత్త శతాబ్దావతరణ అన్ని జాతుల, మతాల, సంస్కృతులు ప్రజలు జరుపుకునే వుత్సవం. శతాబ్దం మారడం మారుతున్న కాలానికి ప్రతీక. కాలగణనాది ప్రమాణాలు (కాలెండర్లు) విశ్వజనామోదాలు కాకపోవచ్చు. కానీ కాలం విశ్వజనీనం. కాలం నిర్దేశించే కర్తవ్యాలుకూడా విశ్వజనీకాలే. మన కట్టెదుటే నుంచుని మన అస్తిత్వాన్నీ, మానవత్వాన్నీ ఈనాడు ప్రశ్నించే కర్తవ్యాలన్నింటిలో జాత్యహంకారాన్నీ, మానవాసమానతల్నీ, తత్సంబంధిత వ్యవస్థల్నీ నిర్మూలించడం అన్నిటికంటే ముఖ్యం.

జాత్యహంకారం అంతరించిన తరవాత వచ్చే వయోజన వోటింగ్ హక్కుకు, శాంతికి ఒనగూర్చిన గొప్పగౌరవం ఈ నోబెల్ బహుమతి.

# వ్యావహారిక భాషా వాదము - గిడుగు రామమూర్తి

(గతసంచిక తరువాయి భాగము) — డా॥ గిడుగు వేంకట సీతాపతి

వ్యావహారిక భాషావాదులు తమవాదం స్పష్టంగా నిరూపించినా 1913-14లో ఎవరో కొద్దిమంది తప్ప తక్కిన వారందరూ పట్టుదల కొద్దీవినిపించుకొనేవారు కారు. ఈ ''గ్రామ్య'' వాదులు ''ప్రాచీనకావ్యభాషవ్యాకరణాలు చదువుకొనే శ్రద్ధవహించలేక ఈ ''గ్రామ్య'' భాషావాదం చేస్తున్నారన్న నింద వ్యాపించింది. వ్యావహారిక భాషా ప్రయోజనం కోసం చేస్తూ ఉండిన వాదానికి ప్రాచీన కావ్యభాషరాకపోవడం కారణం కాదు, కాని అది లెస్సగా రాదన్నమాట. 1913 వరకున్ను మా తండ్రిగారి విషయంలో సైతము సత్యమే. ఈ లోపం లేకుండా చేసుకోడానికే మాతండ్రిగారు అహోరాత్రములు శ్రద్ధవహించి నన్నయనాటినుండి తమ కాలమువరకున్ను తెలుగు సాహిత్యంలో గల పుస్తకాలు, వ్యాకరణాలు చదివినారు. చదవడమేకాదు, శబ్దరూపాలు ఎట్లు మారుతూ వచ్చినవో నోట్స్ వ్రాసిపెట్టుకొన్నారు. 1913 వీరు రచించిన ''ప్రౌఁదెనుఁగుఁగమ్మ'' ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రికలో ప్రకటితమైనది. అది చదివిన వారికి మాతండ్రిగారు ప్రాచీన కావ్యభాషను ఎంత లెస్సగా చదువుకొన్నారో బోధపడగలదు.

ఈ 'ప్రౌఁదెనుఁగుఁగమ్మ' రచించాలన్న బుద్ధివీరికి పుట్టడానికి కారణం చిత్రమైనది. వీరు ఆంధ్రసాహిత్య పరిషత్తులో సభ్యులుగా ఉంటూ పరిషత్తు వారు తమ వాదమును అంగీకరించునట్లు చేయవలెనని ఆశపడుతూ వచ్చారు. ఆ పరిషత్పత్రికకు ఏదైనా ఒక వ్యాసము వ్రాసిపంపించ వలసినదని జయంతి రామయ్య పంతులుగారు మాతండ్రిగారి పేర తరుచుగాలేఖలు వ్రాస్తూ ఉండేవారు. వ్యావహారిక భాషలోనే కాని గ్రాంథిక భాషలో వ్రాయనని మా తండ్రిగారున్ను గ్రాంథిక భాషలో రచితమైనదేకాని వ్యావహారిక భాషలో రచితమైనది మా పరిషత్పత్రికలో ప్రకటించుటకు వీలులేదని రామయ్య పంతులుగారున్ను పట్టుపట్టడం చేత కొంతకాలం వ్రాయడం జరగలేదు. అప్పుడు మా తండ్రిగారికి ఒక ఆలోచన తట్టింది. ''గ్రాంథిక భాషలోనే రచించి పంపిస్తానుండండ''ని మా తండ్రిగారు ఈ ''ప్రౌఁదెనుఁగుఁగమ్మ'' రచించి పంపించారు. అది పత్రికలో ప్రకటితమైనది. వాడుకలో లేని ప్రాచీనాంధ్రప్రయోగాలు ఎంచి, అందులో బుద్ధి పూర్వకంగా సమకూర్చి రచించారు. అది ఒకరీతి పట్టుదలతో రచించినదే. కాని, ఆదర్శప్రాయంగా ఉండాలని రచించినది కాదు. ఏ కారణంచేత వ్రాసినా, అందులోని కవిత ఎట్లున్నా నన్నయ నాటి ప్రాచీనాంధ్రకావ్యభాష వీరికి చాలా చక్కగ వచ్చునన్న నమ్మకం ఉభయ వాదముల వారికిన్నీ కలిగినది.

1914లో ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవము కాకినాడలో కీ.శే. కిళాంబి రామానుజాచార్యుల వారి అధ్యక్షతను జరిగినది. వీరు విజయనగరం మహారాజావారి కాలేజీలో ప్రిన్సిపాలుగా ఉండేవారు. అప్పటికి మా తండ్రిగారు విజయనగరం రాజకుమారునకున్ను (సర్ విజయ, క్రికెట్ ఆటగాడు) అతని సోదరికిని ట్యూటరుగా ఉండేవారు. అందుచేత గురుజాడ

అప్పారావుగారూ, వీరూ తరచుగా రామానుజాచార్యులవారిని కలుస్తూ ఉండేవారు. ఆంధ్రభాషా వ్యాసంగం జేస్తూ ఉండేవారు. అప్పటికింకా రామానుజాచార్యులవారు మావాదము అంగీకరించలేదు. అందుచేత వీరిద్దరున్ను వారిని లొంగదీసుకోడానికి ప్రయత్నిస్తూ ఉండేవారు. అదివరకప్పుడే పెద్ద పండితులని పెద్దపేరుపొందిన పేరి కాశీనాథశాస్త్రిగారున్ను, మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయ శాస్త్రిగారున్నూ, మా వాదము అంగీకరించారు. ఆంధ్రవ్యాకరణాలు - అందులోను చిన్నయసూరి ''బాలవ్యాకరణము'' జిహ్వాగ్రమందున్నదని పేరు పొందిన పండితులు వఝుల చినసీతారామస్వామి శాస్త్రులుగారు విజయనగరం వచ్చి స్థిరపడ్డారు. వారు రామానుజాచార్యులుగారికిన్నీ, అప్పారావుగారికిన్ని ఆంధ్రభాషావ్యాసంగమందు సహాయకులుగా ఉండేవారు. అప్పారావు గారి ప్రోత్సాహముతో, ఈ శాస్త్రిగారు వ్యావహారిక భాషా వాదాన్ని అభినందిస్తూ సభలలో ఉపన్యసిస్తూ ఉండేవారు. అందుచేత, కాబోయే కాకినాడ సభకు రామానుజాచార్యులవారు అధ్యక్షులయినందుకు వీరందరున్ను ఆనందభరితులయి, ఆ సభకు హాజరయినారు. ఆ సభకు నేనూ బుర్రా శేషగిరి రావు కూడా వెళ్ళాము. అక్కడ ప్రసంగించడానికి మాకెవ్వరికీ పరిషత్తువారు అవకాశమివ్వలేదు. అయితే అప్పుడు కీ.శే. కొచ్చెర్లకోట వేంకట కృష్ణారావు బహద్దరు వారు మాకు ఆతిథ్యమిచ్చి, మరి మూడు దినాలు మమ్ము కాకినాడలో ఉంచి, వేరే సభలు ఏర్పాటు చేశారు. మొదటి రోజున గురుజాడ అప్పారావుగారున్ను, మాతండ్రిగారున్ను ప్రసంగించారు. రెండవరోజున శ్రీ వఝుల చిన సీతారామస్వామి శాస్త్రులవారు తెలుగు వ్యాకరణాల ధర్మాన్ని గురించి ప్రసంగించి నేటి వ్యావహారిక భాషాలక్షణం కూడా చేర్చుకోవాలన్నారు. మూడవరోజున శ్రీ బుర్రా శేషగిరిరావున్నూ, నేనున్ను ప్రసంగించాము. ఆ సమయంలోనే కర్జన్ ప్రభువు సలహాలననుసరించి మద్రాసు యూనివర్సిటీవారు అరవం, తెలుగు, కన్నడం, మళయాళ భాషల గురించి పరిశోధనలు సల్పగల వారిని నియమించడానికి పూనుకొని, తెలుగు భాషకు మాతండ్రిగారిని నియమించుటకు ఉద్దేశించి, సెనేటు సభ్యుల ఆమోదం కోసం తమ ఉద్దేశం ప్రకటించారు. వీరిని నియమించి ఉంటే, వీరి సంకల్పం వేగముగానే నెరవేరి వుండేది. యూనివర్సిటీవారిని వ్యావహారిక భాషావాదాన్ని అంగీకరింప జేసి వుండేవారేమో. అదికాకపోయినా తెలుగువ్యాకరణ విషయంలో గాని, తెలుగు నిఘంటువు నిర్మాణ విషయంలో గాని, నన్నయ భారతం సంప్రదించడంలోగాని కొంతపని సాగించి యుండేవారు. కాని, అది ప్రాప్తంకాలేదు. వీరు 50 ఏళ్లుదాటినవారనిన్నీ, చిన్నవారిని నియమించిన యెడల వారిని జర్మనీ మొదలయిన విదేశాలకు పంపి భాషా తత్వపరిశోధనపద్ధతులు నేర్పించడానికి అవకాశముంటుందనన్నీ చెప్పి వీరిని నియమించలేదు.

1913 లో మదరాసు యూనివర్శిటీవారు నియమించిన సలహా సంఘము వ్యావహారికి భాషావాదమునకు అనుకూలమైన తీర్మానాన్ని తిరస్కరించినది. ఈ లోగా ఆంధ్రదేశమంతటా, శ్రీ పిఠాపురం మహారాజావారూ, ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారూ, పండితులూ, ఉపాధ్యాయులూ, వీరూ, వారూ అనడమెందుకు మొత్తం మీద ఆంధ్రులందరూ వ్యావహారిక భాషావాదాన్ని ప్రతిఘటిస్తూ మదరాసు యూనివర్శిటీకి, ప్రభుత్వానికి శరపరంపరలవలె మహజర్లు

పంపించారు. అందువల్ల యూనివర్శిటీ 1914 లో వ్యావహారిక భాష యూనివర్శిటీ చదువులకు అగ్రాహ్యమని నిర్ణయించింది. ఈ నిర్ణయానుసారం వ్యావహారిక భాషలో వ్యాసరచన చేయవచ్చు నన్న ఒప్పందమును విద్యాశాఖ వారు సైతము (స్కూల్‌ఫైనల్ విద్యార్థులకు ఇచ్చి దానిని) ఉపసంహరించుకొన్నారు. లోకం విరుద్ధంగా ఉంటే మేమేమి చేయగలమని కూడా అన్నారు.

**మూడవ ఘట్టము:-** ఈ వ్యావహారిక భాషా వాదమును సాగించుటకు అప్పారావుగారున్నూ మా తండ్రిగారున్నూ నిశ్చయించుకొని పని మొదలు పెట్టారు. 1915 లో అప్పారావు గారు స్వర్గస్థులయినందు వల్ల మా నాన్నగారొక్కరే ఈ పని సాగించుటకు పూనుకోవలసి వచ్చినది. వారికి నేనున్ను, బుర్రా శేషగిరిరావు తోడుగా నిలిచాము. మరి మూడు సంవత్సరముల తర్వాత చిలుకూరి నారాయణ రావు మాతో చేరాడు.

1914 నుండి 1918 వరకు నేనూ, మా నాన్నగారు బరంపురం, విజయనగరం, విశాఖపట్నం, కాకినాడ, రాజమహేంద్రవరం, గుంటూరు, మచిలీపట్నం, నెల్లూరు, అనంతపురం, మదరాసు మొదలైన పట్టణాలలోని కాలేజీలకు వెళ్లి, ఆ యా కాలేజీల ప్రిన్సిపాలులతోను, ఇతర విద్యాధికారులతోను సంప్రదించి, పండిత సంఘ సమావేశాలు కావించి మా వాదము తెలియజేశాము. మేము చెప్పిన అంశములకు తగిన సాక్ష్య సంపన్నాలుగల తాటాకు గ్రంథాలు, వ్రాత ప్రతులు, చిన్నయసూరికి పూర్వ ముండిన వచన గ్రంథాలు మొదలయిన రికార్డంతా ఆయా సంఘాల యెదుట పెట్టి రుజువు పరుస్తూ, ప్రసంగించేవారము. మేము చెప్పినది కాదనడానికి ఎవరికీ ధైర్యము లేక పోయినది. మా వాదము సహేతుకంగా ఉన్నదని కొందరు అంగీకరించినారు. వ్యావహారిక భాష అన్నిమండలాలలోను ఒకే రీతిలో లేదు గదా, దేనిని ప్రమాణంగా అంగీకరించవలెనన్న పాత ఆక్షేపమును సూచించారు. కొందరు, మాండలిక రూపాలు భిన్నంగా ఉన్నవన్నమాట నిజమే. ఈ చిక్కు గ్రాంథిక భాషకు కూడా తప్పదని మేము వివరించి, మాండలిక రూపాలన్నీ గ్రాహ్యములే, అగ్రాహ్యములని ఏ లక్షణ కర్త అనలేదని చెప్పాము. అంతేకాదు భాషా వర్ణవము మొదలైన నిఘంటువులలోనికి ఎక్కినవని చూపించాము. ఎవరి మండలములో ఉన్న పదములు వారు ప్రయోగించారు. ఇంతకూ తమ మండలములో ఉన్న శబ్దములు ఇతర మండలములలో లేవన్న సంగతి ఎవరికైనా ఎట్లు తెలియగలదని మేము వారిని అడిగేము. వారు మిన్నకున్నారు.

ప్రారంభంలో ఈ ప్రచారం మా తండ్రిగారికి కొంత చికాకు గానే ఉండేది. 1915 లో రాజమహేంద్రవరమందు జరిగిన ఆంధ్రమహాసభలో వీరిని సరిగా మాట్లాడనివ్వక కొందరు అల్లరి చేశారు. ఆ సభలో ఒక్క బులుసు పాపయ్యశాస్త్రిగారు తప్ప యింకెవ్వరూ వీరి పక్షమున చెయ్యి ఎత్తిన వారు లేకపోయారు.

1916 లో కొవ్వూరులో జరిగిన సభలో మాత్రము వీరి వాదమునకు అనుకూలముగా ఒక తీర్మానము సభాసమ్మతమైనది. ఆ సభకు కందుకూరి వీరేశలింగం పంతులు గారు కూడా వచ్చి దూరంగా కొంత సేపు నిలబడి మానాన్నగారి ప్రసంగంవిన్నారు. వీరి వాదం సహేతుకంగా ఉందని

మెచ్చుకొన్నారు. అటుపిమ్మట శ్రీరామమూర్తి పంతులుగారి వాదంలో సత్యం లేక పోలేదు. ప్రాచీన లక్షణాలకు విరుద్ధమైన ప్రయోగాలు కొన్ని నేడు వాడుకలోనికి వచ్చినవి. అందుకొన్నిటిని కవులు ప్రయోగించారు. వాటిని తప్పులనుట కంటె ఒప్పులుగా గ్రహించి లక్షణాన్ని సవరించు కొనాలి. అయితే రామమూర్తి పంతులు అంతటితో తృప్తి చెందక కవులకున్న లోకమే ప్రమాణం గనుక కవులు ప్రయోగించినా, ప్రయోగించక పోయినా వాడుక భాష అంతా గ్రంథరచనకు అర్హమైనదే అని వాదిస్తున్నారు. అది ఎంతవరకు గ్రాహ్యమా అని ఆలోచిస్తున్నాను'' అని వారు తమ మిత్రులతో అన్నారు. ఈ సంగతి తెలిసి మా తండ్రిగారు రాజమహేంద్రవరం వెళ్లి వీరేశలింగం పంతులుగారిని కలుసుకొన్నారు. ఇద్దరూ రెండు గంటలసేపు ఈ విషయమై ప్రసంగించు కొన్నారు. వ్యావహారిక భాషావాదనకు సంబంధించిన ప్రధాన విషయములన్నిటను పంతులుగారు మా తండ్రిగారితో ఏకీభవించారు. ఆ వెంటనే రాజమహేంద్రవరములో 28-2-1919వ తేదీన పంతులుగారి ఆనందాశ్రమములో ఒక విద్వత్సభజరిగినది. దానికి పంతులు గారు అధ్యక్షత వహించారు. ఆ సభలోని వారు అప్పుడే ''వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజము''ను స్థాపించారు. దానికి అధ్యక్షులయినారు. మా తండ్రిగారున్ను, జయంతి గంగన్న గారున్ను కార్యదర్శులు. ఆ సమాజ ముఖ్యోద్దేశ్యములను సైతము ఆ సభవారే నిర్వచించారు. అవి, 1. వ్యావహారిక భాషకున్ను గ్రాంథిక భాషకున్ను ఇప్పుడున్న వ్యత్యాసమును సాధ్యమైనంతవరకు తగ్గించి, భాషను సులభము చేయుట. 2, జ్ఞానాభివృద్ధికై వ్రాయు గ్రంథములలో సాధ్యమైనంతవరకు వ్యవహారములో నున్న రూపములనే ఉపయోగించి, వ్యవహారములో లేనివి విడిచి పెట్టుట, 3. వ్యవహారములో ఆవశ్యకములు కాకుండ ఉపయోగించుచున్న అన్యదేశ్యపదములను విడిచి, ఆవశ్యకమైన పదములనే చేర్చుకొనుట. 4. పై ఉద్యేశ్యముల ననుసరించి గ్రంథములను వ్రాయుట.

ఈ సమాజము ఏర్పడ్డ కొద్దికాలములోనే 27.5.1919వ తేదీన పంతులుగారు కాలధర్మము నొందుటచే సమాజమునకు కలిగిన నష్టము ఇంతింతని చెప్ప శక్యము కాదు.

అయినా వారి అధ్యక్షతను స్థాపితమైన ''వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజము'' కొంత పని చేయక పోలేదు. ప్రారంభమందే ఏబదిమంది సభ్యులుగా చేరారు. మా తండ్రిగారు ''తెలుగు'' మాసపత్రికను నెలకొల్పి ఒక సంవత్సరము నడిపించారు. పండ్రెడు సంచికలు వెలువడినవి. క్రమముగా సమాజమందలి సభ్యుల సంఖ్య ఎక్కువైనది. ఈ సంచికల్లో మా తండ్రిగారి వ్యాసములు, ''బాలకవి శరణ్య'' మందలి రెండు ప్రసంగములు, '' ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజములోని ప్రసంగములు ప్రకటితమైనవి. చిన్నయ సూరికి పూర్వముండిన వచన రచనా సంప్రదాయమును మా తండ్రిగారు తమ వ్యాసములలో తెలియజేసినారు. నలుగురుతో ప్రారంభమైన ఉద్యమములో 1919-1920 నాటికి రెండువందలమందికి పైగా చేరినారు.

వ్యావహారిక భాషా వాదములోని ముఖ్యాంశములను మా తండ్రిగారు ఈ క్రింది విధముగా తెలియజేసినారు.

1. వ్యావహారిక భాష ముఖ్యముగా వచన రచనకే ఉద్దేశింపబడినది.

2. విశ్వ విద్యాలయములలో ప్రాచీన కావ్యభాషలో గల గ్రంథాలను పాఠ్య గ్రంథాలుగా పెట్టి కావ్యభాషను విద్యార్థులకు చెప్పవద్దనడము లేదు. కాని, ఎట్లు ఆంగ్ల విద్యార్థులు చాసర్, షేక్స్పియర్, మిల్టన్ మొదలైన కవుల గ్రంథాలను చదువుతూ ఉన్నా తమ వచన రచన వ్యావహారిక భాషలో సాగిస్తున్నారో అట్టే మన తెలుగు విషయములోను కావలెను.

3. పద్యరచన గురించి మా వాదము జోక్యము కలిగించుకొనలేదు. అయినా కవులు తమ కాలమునాటి వాడుక పదములు చేర్చుకొంటూ వచ్చినట్లు నేటి కవులున్ను తమ కాలమునాటి భాషారూపములను ప్రయోగించుకొనవచ్చును.

1924-25 లో తణుకులో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్ వార్షిక సభలోనే వ్యావహారికాంధ్ర భాషా ప్రయోజనము నంగీకరించిన తీర్మానము సభా సమ్మత మైనది. అది ఆ పరిషత్తు పెద్దలకు అనిష్టమై బాధించినందువల్ల గ్రాంథిక భాషాభిమానులే కాని వ్యావహారిక భాషాభిమానులు ఆ పరిషత్తులో ప్రవేశించడానికి ప్రతిబంధకములైన కొన్ని కట్టు దిట్టములు ఆ మరుచటి సంవత్సర పరిషత్తు సమావేశములో ఏర్పడినవి. అందువలన మా తండ్రిగారు తమ మతము ప్రకారము దాని ఆశయములను మార్పించుట అసాధ్యమని ఎంచి మరి దానిలో సభ్యులుగా ఉండుటకు అంగీకరించక దేశములో తమ వాదమును ప్రబలము చేయుటకు పూనుకున్నారు. దేశములో అధిక సంఖ్యాకులు ఈ వాదమును ఒప్పు కొన్నతర్వాత గాని విశ్వవిద్యాలయములున్ను, ప్రభుత్వ విద్యాశాఖ వారున్ను వ్యావహారిక భాషను గ్రహించరన్న విషయమును గుర్తించి మా తండ్రిగారు తమ ప్రచారమును సాగించారు. ఈ విషయము లెస్సగా పత్రికలలో చర్చిత మైనది.

**నాల్గవ ఘట్టము :-** 1933 డిసెంబర్ 22, 23, 24 తేదీలలో మా తండ్రిగారి సప్తతితమ జన్మదినోత్సవములు కడు వైభవంగా రాజమహేంద్ర వరములో జరిగినవి. ఈ సభలకు రాయప్రోలు సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. దేశములోని వివిధ ప్రాంతాలనుండి కవులు, పండితులు ఈ ఉత్సవాలకు వచ్చారు. ఈ సందర్భంలో మా తండ్రిగారు రచించిన 1. వ్యాసావళి, 2. పండిత భిషక్కుల భాషాభేషజము, 3. బాలకవి శరణ్యము, 4. గద్యచింతామణి అను నాలుగు గ్రంథాలను, మా తండ్రిగారు ఏయేశాఖలలో కృషిచేశారో వాటికి సంబంధించిన విషయాలపైని ప్రముఖ విద్యావేత్తలు రచించిన వ్యాసములు గల వ్యాస సంగ్రహాన్ని జన్మదినోత్సవ నిర్వాహక సంఘమువారు విడుదల చేశారు.

అప్పటికి కొన్ని పత్రికలు వ్యావహారిక భాషలో రచితములైన వ్యాసములు, కథలు, పద్యాలు, పాటలను ప్రకటిస్తూ వచ్చినవి. కొన్ని పత్రికలలో సంపాదకీయములు గూడ వ్యావహారిక భాషలోనే రచింపబడుచుండినవి.

1948 లో ప్రభుత్వమువారిచేత ఆస్థాన కవులుగా నియమితులయిన, 1950లో దివంగతులైన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు 1926 నుండిన్ని తమ వచన రచనలను వాడుక భాషలోనే సాగిస్తూవచ్చారు.

తమ జీవిత కాలములోనే తమ వాదము నెగ్గినదన్న సంతోషమువారికి కలిగినది. ''నా వాదము అందరూ అంగీకరించ లేదనిన్ని, విశ్వవిద్యాలయముల వారున్ను, ప్రభుత్వ విద్యాశాఖ వారున్ను వ్యావహారిక భాషను గ్రహించ లేదనిన్ని నేనెరుగుదును. కాని నా వాదము సరియైనదన్న విశ్వాసము నాకు పూర్తిగా ఉండుట వల్ల ఎప్పటికైనను తెలుగు వారందరూ నా వాదమును పూర్తిగా అంగీకరించకపోరన్న నమ్మకము నాకు కలదు'' అని తమ మిత్రులతో ఆయన అంటూ.

శ్లో ॥ ''యేనామకేచిదిహన ప్రథయంత్య వజ్ఞాం ।
జానంతితేకి మపి తాక్ ప్రతినైష యత్నః ।
ఉత్పత్స్యతే మమతుకోఽపి సమానధర్మః ।
కాలోహ్యయం నిరవధిర్విపులాచ పృధ్వీ ॥

అనే భవభూతి శ్లోకమును ఉటంకిస్తూ ఉండేవారు.

14.1.1940వ తేదీన గూడవల్లి రామబ్రహ్మంగారు మదరాసులో తమ ప్రజామిత్ర కార్యాలయంలో మా తండ్రిగారి కోరికపైని ఒక పత్రికా గోష్ఠిని నిర్వహించారు. ఆ గోష్ఠిలో మా తండ్రిగారు తమ కడపటి సందేశాన్ని పత్రికల వారికిస్తూ ''పత్రికల వారు నావాదాన్ని బలపరచి, ప్రభుత్వము వారున్నూ, విశ్వవిద్యాలయుముులవారున్నూ ఆమోదించి, గ్రహించునట్లు చేయవలెను'' అన్నారు. 22-1-1940 వ తేదీన మా తండ్రిగారు మదరాసులో నా నివాస గృహమందు దివంగతులైనారు.

మాతండ్రిగారు దివంగుతులైన తర్వాత వారి కడపటి సందేశాన్ని అనుసరించి, ఏవో ఆంధ్రసాహిత్యపరిషత్ పత్రికవంటి పత్రికలవారు తప్ప, తెలుగు పత్రికల వారందరూ తమ రచనలను వాడుక భాషలోనే సాగిస్తున్నారు. సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తు వంటి సంస్థలు మా తండ్రిగారి జీవిత కాలంలోనే వ్యావహారిక భాషలో గ్రంథరచనలు సాగించినవి. ఇటీవల ఇంకా అనేక సంస్థల వారు వ్యావహారిక భాషలో వందల కొలదిగా గ్రంథములను ప్రకటించారు. లోకంలో వ్యావహారిక భాషగ్రంథ రచనకు అర్హమైనదన్న అభిప్రాయ మింత ఎక్కువగా వ్యాప్తి చెంది యున్నా ప్రభుత్వ విద్యాశాఖవారున్ను, విశ్వవిద్యాలయముల వారున్ను వ్యావహారిక భాషకు పెట్టిన ఆంక్షను ఇంకా తొలగించలేదు. ఈ వ్యాసము 1958కి పూర్వం రచించబడినది. అందుచేత బడులలోను, కళాశాలలోను పాఠ్యగ్రంథాలుగా పెట్టించుకొనే ఉద్దేశ్యంతో రచితములైన గ్రంథాలున్ను, ''గ్రాంథిక భాష'' యెడల మక్కువ గల ఏ కొలదిమందో రచిస్తూ ఉన్న గ్రంథములున్ను మాత్రమే తప్పుగానో ఒప్పుగానో కావ్యభాషా రూపాలతో రచితములగుచున్నవి. తక్కిన వన్నీ వందల కొలదిగా వాడుక భాషలోనే రచితములగుతున్నవి. మాండలీయక ప్రయోగాలవల్ల ఈ గ్రంథములు అర్థం కావడం లేదన్న వాదు అంతరించినది.

రెండు విషయములను మాత్రం మనం గుర్తించాలి. ఈ వ్యావహారిక భాషా వాదమంతా ముఖ్యంగా వచన రచన కోసమే పుట్టినది. చిన్నయసూరి తన వచన రచన కావ్య భాషలో

ప్రారంభించినంతవరకున్ను పూర్వం మన పెద్దలు వచన రచనను వాడుక భాషలోనే సాగించారు. ఏయే విధములైన విషయములను గూర్చి వాడుక భాషలో ఎన్నెన్ని గ్రంథమలు రచితములైనవో మచ్చుతునకలతో మా తండ్రిగారు ''గద్యచింతామణి'' గ్రంథములో తెలియ జేసినారు.

పద్యరచన విషయమును వ్యావహారిక భాషావాదులు ముఖ్యమైనదిగా పెట్టుకొనలేదు. అయితే దానిని గురించి కూడా మా తండ్రిగారు ఆలోచింపక పోలేదు. పద్యరచనలో కావ్యభాషలో గల కొన్ని శబ్ద రూపాలను జోడిస్తే కాని పద్యం, గేయం రసవంతంగా ఉండవు అని గురుజాడ అప్పారావుగారు అంటూ ఉండేవారు. ఆ భావాన్ని అనుసరించే ''గుత్తునా ముత్యాల సరములు, కూర్చుకొని తేటైన మాటల, కొత్త పాతల మేలు కలయిక, క్రొమ్మెరుంగులు చిమ్మగా'' అని తన గేయం రచించారు. అందుకు సరేనన్నారు మా తండ్రిగారు. అయితే కావ్యభాషకూడా ఎట్లు మారుతూ వచ్చిందో, కవులు తమ కాలంనాటి వ్యావహారిక భాషాశబ్ద రూపాలను కొద్దిగా నైనా ఎట్లు తమ కావ్యాలలో ప్రయోగిస్తూ వచ్చారో తెలియజేస్తూ, తమ ''బాలకవి శరణ్యము'' అనే గ్రంథాన్ని మా తండ్రిగారు రచించారు.

ఏ గ్రంథమూ పుట్టక మునుపు అంతా ఒకే భాష ఉండేది. అందుచేత మొట్టమొదటి గ్రంథము వ్యావహారిక భాషనే ఆశ్రయించి రచితమైనది. తర్వాత గ్రంథరచయితలకు తమ కలవడిన వ్యావహారిక భాషతో బాటు తమకు పూర్వులయినవారు రచించిన గ్రంథములలోని భాషకూడా గ్రాహ్యమయినది. తెలుగు భాష దేశ్య, అందుచేతనే నిత్య ప్రవాహినీ దేశ్యా అనే సూత్ర భావాన్ని అనుసరించి నిత్యంగానే ఉంటూ, నిత్యమున్ను ప్రవాహంలోని నీళ్లు మారుతూవున్నట్లే మార్పులు చెందుతూ, సాగుతూ వుంటుంది. (శబ్ద) సిద్ధిర్లోకాద్ దృశ్యా అన్నారు. అదే తెలుగులో శబ్దసిద్ధి లోకము వలన తెలియును అన్నారు. అనగా శబ్దరూపములు లోకంలో వాడుకను బట్టి సిద్ధిస్తున్నవే కాని వైయాకరుణుడు పుట్టించడు, పుట్టించలేడు అని భావము. ప్రాచీన కవి ప్రయోగము శబ్ద రూపంలో గాని శబ్దార్థములో కాని లోక వ్యవహారమునకు విరుద్ధముగా ఉన్నప్పుడు దానిని ప్రయోగించకూడదన్న నియమం కొన్ని భాషలలో ఉన్నది. వేదభాషలో నుండిన కొన్ని శబ్ద రూపాలు సంస్కృత భాషనాటికి వ్యవహార భ్రష్టములైనవి. అవి ''ఆర్ష'' ప్రయోగాలు; వాటిని వాడకూడదని పాణిని మొదలైన సంస్కృత భాషావైయాకరణులు నిషేధించారు. ఉదాహరణం: స్థా (= ఉండు) అనే ధాతువుకు సంబంధించిన శబ్దరూపాలు స్థామి, స్థాతు మొదలైనవి వేదంలో ఉన్నా సంస్కృత భాషలో వాడకూడదు. వాటికి మారుగా తిష్ఠామి, తిష్ఠతు మొదలైనవి ప్రయోగించాలి. మన తెలుగు భాషలో గూడ 'ప్రాతవడ్డ మాటలు' ప్రయోగార్హములు కావన్న భావమును తిక్కన సోమయాజి కూడా తెలియజేశారు. (చూ.చ. పలుకుల పొందలేక రసభంగము సేయుచు ప్రాతవడ్డ మాటల.) ''ప్రయోగమూలం వ్యాకరణం'' అనే ప్రాథమిక సూత్రాన్ననుసరించి అప్పకవి మొదలు అడిదంసూరకవి వరకున్ను గల లాక్షణికులు తమ పూర్వులు కావ్యాలలో గల ప్రయోగాలలో ఏవైతే పూర్వవ్యాకరణ సూత్రాలకు విరుద్ధముగా నున్నవో వాటిని గుర్తుగా పెట్టుకొని వ్యాకరణ లక్షణాలను సవరిస్తూ వచ్చారు. చిన్నయ సూరి ఈ

సంప్రదాయమును గుర్తించికూడా కవిప్రయోగాను లక్ష్యములుగా చూపింపక తన వ్యాకరణ రచన సాగించారు. అతని వ్యాకరణ మందున్న కొన్ని సూత్రాలు నన్నయ భాషకే వర్తిస్తవి. కొన్ని సూత్రాలు ప్రాచీన కవుల గ్రంథములకే వర్తిస్తవి. ఆ సూత్రాలను ప్రమాణంగా తీసుకొంటే మహాకవి ప్రయోగాలు కొన్ని లక్షణ విరుద్ధాలు కాక తప్పవు. తెలుగు భాషా వైయాకరణులు సంప్రదాయ సిద్ధంగా అనుసరించిన మార్గాన్ని అనుసరించిన కవుల ప్రయోగాలను సేకరించి వాటిని ఆధారంగా పెట్టుకొని వ్యాకరణ సూత్రాలను సవరిస్తే కావ్యభాషకున్ను నేటి శిష్టజన వ్యావహారిక భాషకున్ను గల తారతమ్యము చాలా తగ్గిపోతుంది. సిద్ధిర్లోకాద్ దృశ్యా అనే ప్రాథమిక వ్యాకరణ సూత్రాన్ని అనుసరించి నేటి శిష్ట జన వ్యావహారిక భాషను గ్రహిస్తే కావ్య భాష, వాడుక భాష అనేవి రెండూ ఒకే భాషగా ఐక్య మొందగలవు.

మా తాతగారు, రామమూర్తి పంతులుగారు జీవించి యుండగా ఆంధ్ర, మదరాసు విశ్వవిద్యాలయాలవారు వ్యావహారిక భాషను అంగీకరించలేదు. మదరాసు యూనివర్శిటీలోని తెలుగు బోర్డు ఆఫ్‌స్టడీస్‌కి 1955లో మా నాన్నగారు, సీతాపతిగారు, చైర్మన్‌గా ఉండినప్పుడు నేటి వ్యవహారంలో ఉన్న పూర్వకవి ప్రయోగాలను విద్యార్థులు వాడ వచ్చునన్న తీర్మానాన్ని ఆమోదింపజేశారు. అయితే 1965 వరకు ఆంధ్రప్రదేశ్‌లోని మూడు విశ్వవిద్యాలయాలవారు ఈ విషయాన్ని చర్చించనైనా లేదు. 1965 లో విశ్వవిద్యాలయాల పాఠ్యగ్రంథాలలోని భాషాశైలి విషయం చర్చకు వచ్చినప్పుడు భద్రిరాజు కృష్ణమూర్తిగారు వ్యావహారిక భాషే అనుసరణీయమని పట్టుపట్టారు. ఈ.విషయమై పింగళి లక్ష్మీకాంతంగారి అధ్యక్షతను ఒక సమావేశం జరిగింది. ఆ తర్వాత వారి అధ్యక్షతనే ఒక 'స్టయిల్‌కమిటీ' ఏర్పడింది. ఈ కమిటీ తీర్మానాల దృష్ట్యా గ్విక్‌గారి అధ్యక్షతను ప్రభుత్వం మరొక కమిటీని నెలకొల్పింది. ఈ కమిటీ సూచనల ననుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1969 లో 'తెలుగు అకాడమీ'ని స్థాపించింది. ఈ యకాడమీ ఇంటర్‌మీడియేట్, బి.ఏ. తరగతుల వివిధ సాంకేతిక విషయాల పాఠ్యపుస్తకాలను వ్యావహారిక భాషలో ప్రచురించడం మొదలు పెట్టింది. పి.హెచ్‌డి. చేసే విద్యార్థులు తమ పరిశోధనా వ్యాసాలను వ్యావహారిక భాషలో వ్రాయడానికి శ్రీ వేంకటేశ్వరా యూనివర్శిటీ 1969లో అనుమతించింది. 1973లో ఆంధ్రాయూనివర్శిటీ వారు వ్యావహారిక భాషను ఆమోదించారు. 1906 లో విద్యావిషయంగా యేట్సు దొరగారి సూచనతో రామమూర్తి పంతులుగారు ప్రారంభించిన వ్యావహారికా భాషా ఉద్యమం 1973 లో సంపూర్ణంగా ఫలవంతమైనదని చెప్పవచ్చును.

**– జి.వి. రామమూర్తి**

(డా. గిడుగు వేంకట సీతాపతి గారు ఆరోజుల్లో స్వదస్తూరితో రాసిన ఈ వ్యాసప్రతిని సేకరించి మా కందించిన కె. జితేంద్ర; అడ్వొకేట్, హైదరాబాద్ గారికి, వ్యాసాన్ని సరిచూసిన గిడుగు రామమూర్తి గారి మనుమడు గిడుగు రామమూర్తిగారికి మిసిమి కృతజ్ఞతలు తెలుపుకొంటోంది.)

**– సంపాదకుడు**

# కలసికట్టుగా బతక్కపోతే

**- రాజేంద్రకుమార్ దేవరపల్లి**

భారతీయ సంస్కృతి ప్రమాదం అంచున ఉన్నది; సినిమాలు సాహిత్యం, మీడియా ముఖ్యంగా టీవీ ఛానెళ్లు దేశసాంస్కృతిక వాతావరణాన్ని కలుషితం చేస్తున్నాయి. వీటి ప్రభావం వల్ల కుల, మత, ప్రాంతీయ, లింగ, ధన, వయోబేధాలు లేకుండా అందరూ చెడిపోతున్నారు. వేల సంవత్సరాల ప్రాచీన, వేద సంస్కృతి నాశనమై పోతోంది. కాబట్టి దీన్ని అడ్డుకునేందుకు ఏమయినా చేయాలి. ఇవి- ఈ రోజు మేధావులు అనిపించుకుంటున్న కొందరు వ్యక్తం చేస్తున్న ఆవేదనా భరిత వ్యాఖ్యలు. అయితే, ఏం చేయాలో ఏ ఇద్దరూ ఒక్కమాట చెప్పట్లేదు.

అసలు సంస్కృతిలేక భారతీయ సంస్కృతి అనే బ్రహ్మ పదార్థానికి సిసలు నిర్వచనం ఏమిటి? మత, రాజకీయ, సాహిత్య సంస్థలు ఎవరికి వారు ఈ అంశాన్ని నిర్వచిస్తూ, పునర్వ్యాఖ్యానిస్తూ, ఖండిస్తూ, మళ్లీ ప్రవచిస్తూ... ఇలా అనంతంగా సాగిపోతుందీ ప్రక్రియ. ఎవరి సంస్కృతి నిఖార్సైంది అనే ప్రశ్నలు మొలవడం మంచిదే. కానీ, ఆ ప్రశ్నల్ని మొగ్గలోనే తుంచే కొందరి ప్రయత్నాలు కొన్ని చోట్ల విజయవంతమవుతున్నాయన్నా.మాటలు విన్నపుడల్లా హిట్లరు చచ్చిపోలేదనీ, మనువు మనమధ్యే ఉన్నాడని అనిపిస్తోంది. సంస్కృతీకరణ, పాశ్చాత్యీకరణ పాత మాటలయి పోతే అమెరికనైజేషన్, జాక్సనైజేషన్, కోకోకోలానైజేషన్, హిప్పిజమ్ ఇటీవల ఎక్కువగా వాడుకలోకి వచ్చిన పదాలు.

ఏ దేశానికయినా తనకంటూ ఉన్న లేక ఉన్నదని తాను భావిస్తున్న సంస్కృతిని పరిరక్షించు కోవటం ఏ అవసరం చేతయినా తప్పని సరి అంశం. మనల్ని సాంస్కృతికంగా నాశనం చేస్తుందనే అమెరికా లో కూడా 'మదర్స్‌డే' 'థాంక్స్‌గివింగ్‌డే' వంటి పండుగలు నిరాటంకంగా జరుగుతూనే ఉన్నాయి. ఈ పండుగలకు మతప్రాముఖ్యం లేకపోవటం గమనార్హం. మనలాగా అమెరికాకు వేలసంవత్సరాల సుదీర్ఘ చరిత్ర ఏమీలేదు. ఆదేశమే నానాజాతి సమితి. పంచకూళ్ళ కషాయం లాంటి ఆదేశపు తుంపరలను అమృత ధారల కింద స్వీకరించి, కళ్ళకద్దుకుంటున్న వారున్నారంటే దాని ప్రబల్యం కొంతే, వీళ్ళ దౌర్బల్యమే అధికం. వలసలు, వాషింగ్టన్ నేతృత్వంలో అమెరికా సంయుక్తరాష్ట్రాలుగా ఏర్పడిన నాటినుంచి ఇప్పటి క్లింటన్ ప్రభువుల వరకూ అమెరికన్లు అంతరాంతరాల్లో ఆత్మన్యూనతా భావంతో బాధపడేది తమకులేని తమదైన సంస్కృతి గురించే. అమెరికాకు ప్రతీకగా చూపించే 'లిబర్టీ' విగ్రహమే ఫ్రెంచివారు బహుకరించింది. ఆ బహూకరణలో రాజకీయ కారణాలు ఉండడం వేరే సంగతి.

అమెరికాలో టీవీ ప్రాబల్యం పెరిగింది మన నెహ్రూగారికి మంచి మిత్రుడూ, అనూహ్యంగా హత్యకు గురయిన కెన్నడీ ఎన్నిక సందర్భంలోనే. నిక్సన్, కెన్నడీల మధ్య అమెరికా అధ్యక్ష పదవికి జరిగిన పోటీలో ఏర్పరిచిన టెలివిజన్ కార్యక్రమంలో 'కెమరా సెన్సు' ఉన్న కెన్నెడీ గెలవడంతో ప్రపంచ మీడియా చరిత్ర ఒక మలుపు తిరిగింది. జార్జివాషింగ్టన్ నుండి ఈ రోజువరకూ ఆదేశానికి ఎన్నికయిన రోమన్ కాథలిక్ కెన్నెడీయే అంటే అక్కడి టీవీ ప్రభావం మనం ఊహించుకోవచ్చు. కెన్నెడీ ' ఇమేజి'ని భూతద్దంలో చూపేందుకు, విజయకారణంగా టీవీ ఉపకరించిందన్న ఉప్పందుకున్న వణిక్ ప్రముఖులు ఎందుకు వెనుకాడతారు? ఆనాటినుండీ టీవీ కెమరాలు, డ్రాయింగు రూములనుండి బెడ్‌రూములు, బాత్‌రూముల్లోకి, మత సంస్థలనుంచి మార్చ్యురీలదాకా పాకాయి. వినోదాన్ని వ్యాపారంగా, వ్యాపారాన్ని అంతర్జాతీయం చేసి తన సార్వభౌమత్వాన్ని (మనం అమెరికా సాంస్కృతిక సామ్రాజ్య వాదం అంటున్నాం) స్థిరపరచుకునేట్టు అమెరికాను తీర్చిదిద్దిన వారు అతి కొద్ది మంది వ్యాపారులు. వారికి సలహాలు ఇచ్చే వారిలో లాయర్లూ, రచయితలూ, జర్నలిస్టులు ఉండటం పిచ్చికుక్క కరుస్తుందన్నంత నిజం.

అమెరికా మీడియా ఎన్ని వెర్రిమొర్రివేషాలేసినా అదంతా రాజ్యాంగ బద్ధంగా జరుగుతోందని, పత్రికా స్వేచ్ఛను వారు పోరాడిమరీ రాజ్యాంగంలో చేర్పించుకున్నారనీ మనం గుర్తుంచుకోవాలి. అది 'ఫస్ట్ ఎమెండ్‌మెంట్'గా ప్రసిద్ధి చెందింది. ఆ సవరణ సాయంతో అమెరికా మీడియా ఎక్కని ఎత్తులు లేవు, దిగజారని లోతులు లేవు. వాటర్‌గేట్ వంటి కుంభకోణాలను బహిర్గతం చేసినా, జార్జిబుష్‌కు ఎన్నికల్లో సరైన ప్రత్యర్థి, ముఖ్యంగా తన సొంతపార్టీలో లేకుండా చేసినా ఆ మీడియా మహత్యమే. వారి 'న్యూస్‌నోస్'చాలా పొడవు. పవిత్ర భారతదేశంలోని అమ్మలు, బాబాల మాయలు, మహిమలు ఎలావున్నా అమెరికన్ మీడియా వందమంది బాబాలు, వెయ్యిమంది అమ్మలపెట్టు. తిమ్మినిబమ్మిచేయాలన్నా, ఎద్దుపుండును బ్రహ్మరాక్షసి చేయాలన్నా, గోటితోపోయేదాన్ని గొడ్డలి దాకాతీసుకురావలన్నా వారు, వారివిద్యలముందు బ్రిటీషు, వగైరాలు బలాదూరు. మీడియాను 'మార్కెటింగ్' చేయటమనే కళ భారీ పరిశ్రమగా మారుతున్న మన దేశంలో అమెరికా ప్రసారసాధనాల ఉరవడికి ఎదురుతిరిగే సత్తా ఉన్న కొద్దిమంది కూడా బొచ్చెపట్టుకుని ఆకార్యక్రమాలను అడుక్కునేందుకు ముందు వరుసల్లో నిలబడటం విషాదం, బీభత్సం కూడా!

ఎన్నిమంచి పుస్తకాలు చదివాం అన్నది కాకుండా, ఎన్ని ఛానల్స్ తమ టీవీలో వస్తున్నాయనేది, మంచి మార్కులు రావటం కంటే చదువుతో పాటు, (ఇవ్వాళ చదువు, మార్కులు వేరువేరు విషయాలు) మా పిల్లలు ఒంటిచేత్తో మారుతి కారు నడుపుతున్నారని చెప్పుకోవటం స్టేటస్ సింబల్స్‌గా మారిన రోజులు. పూర్తిగా 'విముక్తి' చెందిన స్త్రీలు, పెద్దింటి ఆడపడుచులు 'శాంతాబార్బరా' 'ది బోల్డ్ అండ్‌ది బ్యూటీఫుల్' గురించి సెల్యులర్ ఫోన్లలో చర్చించు కుంటుంటే, మధ్యతరగతి మహిళల కోసం 'శాంతి', 'స్వాభిమాన్' ఉన్నాయి. ఇక చౌకధరల దుకాణాల దగ్గర, నీళ్ళ పంపుల దగ్గర, కిరోసిన్ కోసం క్యూలలో నిలబడే వారికి ' ఓహో!' టీవీ వగైరాలు వండి వడ్డిస్తున్న అంతఃపుర వంటకాలు ఉండనే ఉన్నాయి.

ఇంట్లో పిల్లలు పిచ్చిపిచ్చి కార్యక్రమాలు చూస్తూ ఆ పిచ్చినే పిచ్చపిచ్చగా కాపీకొడుతున్నారని వాపోయే తల్లిదండ్రులు ముందు ఆకేబుల్ కనెక్షన్లను ఎందుకు తీసేయించరు? పిల్లల భవిష్యత్తు, దేశసౌభాగ్యం, విశిష్టభారతసంస్కృతి అనే వారంతా ఇండియాలో సాధారణంగా ప్రతి ఇంటికి ఒక్కటీవీయే ఉందని అన్ని కార్యక్రమాలను అందరూ కలిసే చూస్తున్నారన్న విషయం మర్చిపోకూడదు. ఇబ్బందికరమైన సన్నివేశాలు వస్తే పెద్దలో, పిల్లలో అక్కడినుంచి వెళ్ళిపోతున్నారు తప్ప అటువంటి కార్యక్రమాలను మాకు ఇవ్వొద్దని కేబుల్ ఆపరేటర్‌లో ఎందుకు చెప్పలేక పోతున్నారు? కనిపెంచిన పిల్లలే తమమాట విననప్పుడు ఎవరో కేబుల్ ఆపరేటర్ ఏంలక్ష్య పెడతాడు అన్న వాస్తవం గ్రహించే ఊరుకుంటున్నట్లు కనిపిస్తోంది. అలాంటి పరిస్థితుల్లో కేబుల్ కనెక్షన్ కట్‌చేయించాలి, పది కనెక్షన్లు పోతే మంచి ప్రోగ్రాములు రాక ఏంచేస్తాయి? మీరు ప్రసారం చేసే కార్యక్రమాలు అంత చండాలంగా అఘోరిస్తున్నాయని ఆయా టీవీ ఛానెల్సువారికి పదిహేనుపైసల కార్డుముక్క ఎంత మంది రాస్తున్నారు ఈ బాధ్యత గల పౌరులు?

అమెరికన్ నవల ఇక్కడ ఒక రచయితకు ఉచితంగా దొరికే ప్లాటవుతోంది. దాన్నేమరొకరు మధ్యమధ్యలో షెల్లీ, కీట్సు, కాళిదాసు కవితలతో సీరియల్‌గా మారుస్తారు. శ్రమైక జీవన సౌందర్యం, డిగ్నిటీ ఆఫ్ లేబర్ వంటి పదజాలంతో ఇంకొకామె ఎన్నిపాట్లు పడయినాసరే చేరాల్సినభూతల స్వర్గం అమెరికా అంటూ డైలీసీరియల్ రాస్తుంది. నా అమెరికా ప్రయాణ విశేషములు అంటూ ఒక అరువు రచయిత కొన్ని నెలలు సాగదీసి రాసి తర్వాత పుస్తకాలుగా అచ్చేసి అదే అమెరికాను గురించి విజ్ఞాన సర్వస్వ మనుకోమంటాడు. అతని బంధు మిత్రులయిన కొందరు సమీక్షకులు నిజమే ను స్మీ! అంటూ వంతపాడుతారు. మరొకరు హాలీవుడ్ సినిమాల్లోని పాత్రలను అటు ఇటూ చేసి తెలుగు తనం కారిపోతున్న చిత్రరాజమంటూ మనమొఖాన కొట్టి

చూడండి మీ పక్కింట్లో పాత్రలను అంటాడు. ఒక మ్యూజిక్ డైరెక్టరు అమెరికా ట్యూన్లను యథాతథంగా దించేసి మధ్యలో తెలుగుమాటలను వెల్డింగ్ చేసి అనన్యసామాన్యప్రతిభా వంతుడైన సంగీత దర్శకుడు అంటూ సినీ పంచాంగ పత్రికల్లో రాయించుకుంటాడు. సమాజంలోని పై తరగతుల్లో బతుకుతూ మేధావులమనే మేకతోలు కప్పుకుని తిరిగే ఈ కూపస్త మండూకాలకే ఫాలోయింగ్ విపరీతంగా ఉందంటే, వాళ్ళవికారపు పోకడలను ఎప్పటికప్పుడు నిలదీసి ఉతికి పారెయ్యని మిగిలిన వారికి అంటే మేము సీరియస్ రచయిత (త్రు) లం అంటూ మొహం గంభీరంగా పెట్టుకుతిరిగే పండిత ప్రకాండులకు ఆ పాపంలో భాగస్వామ్యం లేదా?

అమెరికాలో ప్రచురితమయ్యే ప్లేబోయ్, పెంట్‌హవుస్, హ్యూమన్ డైజెస్ట్ పత్రికలను తలదన్నుతూ వాటి తాతల్లాగా వెలువడుతున్న సకుటుంబ సపరివార సంసారపక్ష పత్రికలకు నారచనలను పంపనూ అంటూ శపథం చేసి వాటిని బహిష్కరించగలసత్తా ఎంతమందికి ఉంది? ఏదీదాఖలా? లేడిని మింగిన కొండ చిలువచెట్టుకు చుట్టుకుపోయినట్లు విమర్శకుల సింహాసనానికి అంటుకుపోయిన కొందరు పీఠాధిపతులకు ఈ పోకడలన్నీ కనిపించవా? లేక కళ్ళు మూసుకుంటున్నారా? అని సామాన్య పాఠకులు ప్రశ్నిస్తున్నారంటే ఆమాత్రం కామన్‌సెన్స్ వీరిలో లేదా వినబడదా?

టీవీ ఛానల్స్ పెరుగుతున్నాయి. ప్రసారవ్యవధి నానాటికీ అధికమవుతోంది. కానీ వాటి సమీక్షమాత్రం గుప్తుల స్వర్ణయుగంలోనే శిలేసుకుపోయింది. కొన్ని సమీక్షలు అర్థాంతరంగా, సకారణంగా ఆగిపోయాయి. మిగిలిన వేమో కొజ్జా మొగడు కోటలో ఉన్నా, పేటలో ఉన్నా ఒకటేననే నాటు, ముతక సామెతను గుర్తుచేస్తున్నాయి. ఆ మధ్య దూరదర్శన్ వాటీజ్‌రాంగ్‌విత్ డి.డి? అనే కార్యక్రమాన్ని ప్రసారం చేసింది. రాష్ట్రపతి, ప్రధాన మంత్రిని తప్ప, ఎవరినైనా, దేన్నయినా విమర్శించొచ్చని చెప్పింది. డి.డి బాగుపడాలంటే ఏంచెయ్యాలో చెప్పండని ఢిల్లీ ఆహ్వానించి మరీ అడిగింది. ప్రభుత్వప్రసారాలను నోటికొచ్చినట్టు తిట్టి, చేతికొచ్చినట్టు రాసే ప్రముఖులకు పెదాలు అంటుకుపోయాయో, ఆలోచనలు రాలేదో కానీ ఒకరిద్దరు తప్ప నిర్మాణాత్మక సూచనలు, సలహాలు ఎవరూ ఇవ్వలేకపోయారు. వారేమళ్ళీ బయట 'సృజనాత్మకత' 'స్వయంప్రతిపత్తి' 'బంధుప్రీతి' వంటి పడికట్టు పదాలతో చేస్తున్న ప్రకటనలను చూసి జనం 'టేకిట్ ఈజీ' అంటున్నారంటే ఆ నేరం దివాలాకోరులయిన పెద్దలదా, గడుసుదేలిన ప్రేక్షక పాఠకులదా? విదేశీ, ప్రయివేటు ఛానల్స్‌ను ఆడిపోసుకోవడంతోపాటు దూరదర్శన్‌ను బాగుచేసుకోవాల్సిన బాధ్యత కూడా మనదే. ఎందుకంటే అది ప్రజల సొమ్ముతో నడుస్తున్న ప్రభుత్వ సంస్థ కాబట్టి. డి.డి. కొన్ని కులాల, ప్రాంతాల కాలిమేజోడుగా పూర్తిగా మారిపోక ముందే జాగ్రత్త పడటమే ముందుచేయాల్సినపని. కారణం - పరాయిదేశాల వారు మ్యూజిక్, డాన్సులు, బేవాత్‌లతో మనసులను కలుషితం చేస్తే, వీరు దేశీముసుగులో సీరియల్స్ ప్రసారం చేసి మరి కొందరికి లాభాల మూటలు మోసిపెడతారు.

మనకవులు, రచయితల్లో కొంతమందికి టీవీ, సినిమాలగురించి మాట్లాడమంటేనే చిన్నతనం. పత్రికలను విమర్శిస్తే వారి అస్తిత్వానికే భంగం కాబట్టి మనబోంట్లు అలాంటి 'అప్రాచ్యపు' పనిని వారినుంచి ఆశించకూడదు. సామాజిక వాస్తవాల నుంచి పలాయన వాదం పఠించటమో, పరాకు చిత్తగించటమో చేసే 'థింక్‌ట్యాంక్'లకన్నా 'స్టెప్టిక్‌ట్యాంకులు' మేలని ఎవరన్నా ఈసడించుకుంటే అది శ్లాండరవుతుందా? లైబలా?

లౌకికరాజ్యం, మతసమానత్వం, గురించి లెక్కలేనన్ని సార్లు సంపాదకీయాలు రాసిన ఎడిటర్లూ, సాహిత్యపు లోతు చూసిన మేము ఉన్నాం వళ్లుదగ్గర పెట్టుకుని రాయండనే విమర్శక సులోచనాలు అమ్మలకు, బాబాలకు సాష్టాంగ, అంగాంగ ప్రమాణాలు ఆచరిస్తున్నప్పుడు వారు కాలుతో చెబితే తలతో చేసే ఈ రాతపని వాళ్ళు అవార్డులు ఇంక్రిమెంట్లు, సీరియల్ ఎరియర్ల

కోసమో ఏమైనా రాయగలగటం డిమాండ్, సప్లయి సూత్రాన్ని గుర్తుకుతెస్తే ఆజ్ఞాపకం డిమాండ్ చేసిన వారిదా, సప్లయికంపెనీ పెట్టుకున్న సాహిత్య వ్యాపారులదా?

'అమెరికాది' అనే ప్రతీవిషయాన్ని వ్యతిరేకించాలనే భావన కూడా సరియైంది కాదు. కాకుంటే గుడ్డెద్దు చేలో పడ్డట్టు అనుకరించుకుంటూ పోవటమే అనారోగ్యకరం. ష్వార్జ్ నెగ్గర్ సినిమాలనుంచి చార్లీఛాప్లిన్‌నూ, స్టార్ టీవీ నుండి డిస్కవరీ ఛానెల్‌ను వేరుచేసి క్షీరనీరన్యాయాన్ని అవలంబించటమే వివేకానికి, విచక్షణకు గుర్తు.

అమెరికన్ జాత్యహంకారపు పైత్యాన్ని, సామ్రాజ్యవాద శాడిజాన్ని చెప్పుతో కొట్టినట్టుగా, గుట్టు బట్టబయలు చేసినవాళ్ళలో ప్రముఖుడు, మన వాళ్ళు 'సెక్సురచయిత' అని వెలేసిన ఇర్వింగ్‌వాలేస్ అనే 'మామూలు వాణిజ్య' నవలలు రాసుకునే రచయిత. 'ది మాన్' 'ది ప్రైజ్', 'ఆల్‌మైటీ' 'ఛాప్‌మన్ రిపోర్టు' 'గోల్డెన్‌రూమ్' 'సెలెస్టియల్ బెడ్' 'త్రీ సైరన్స్' 'ది ఫాన్‌క్లబ్' 'సెవెన్ మినిట్స్' వంటి నవలలు అమెరికన్ సమాజపు చీకటి మూలల్లోకి చొచ్చుకుపోయిన 'కమర్షియల్ బెస్ట్‌సెల్లర్స్'. అమెరికన్‌జనజీవన స్రవంతిలోని ఆటుపోట్లను, సామాజిక, సాంస్కృతిక, రాజకీయ రంగాలతో అన్వయించుకుంటూ పోయిన వాలేస్ నవలలు ఎకనమిక్స్, పాలిటిక్స్ అనే కళ్ళద్దాలతో చూస్తే బూతు బుంగలు గానే కనిపిస్తాయి. మాఫియా, కేసినో, నైటుక్లబ్బుల చుట్టూ పరిభ్రమించే అమెరికన్ల జీవిత విధానాన్ని 'గాడ్‌ఫాదర్' 'ఫూల్స్ డై' నవలల్లో నగ్నంగా చూపించిన మేరియాపుజో పుస్తకాలు మనజనానికి సినిమాలు తీసుకునేందుకు, సీరియల్స్ రాసుకునేందుకు పనికి వస్తున్నాయి. వెయ్యిమంది అమెరికన్ విమర్శకులకన్నా వాలేస్, ప్యూజో అమెరికా పై మెరుగుల తెరలు తీసి మరీ చూపించారు. మన సీరియస్ రచయితల్లో కొందరయినా సమకాలీన మీడియా పట్ల ఆసక్తి చూపి రాయగలిగితే ఆ విధంగా కూడా దేశసేవ చేసిన వారవుతారు. ఆర్థిక దారిద్ర్యం కన్నా నికృష్టమయిన భావదారిద్ర్యంతో జీవితాల్ని ఈడ్చుకు పోతూ అనుకరణ, అనుసరణల మధ్య మిధ్యావాదంతో ఒంటి స్తంభపు గాజుమేడల్లో బతుకుతూ ఎదుటివారి మీదకు రాళ్ళువిసిరే బాపతు జనానికి 'ఒరిజినాలిటీ'లోని మాధుర్యం వంటబట్టాలంటే ఎన్ని మన్వంతరాలు తాబేలు నడకతో దొర్లిపోతాయో!!

ఉదాసీనత తర్వాత దశ బానిసత్వమే. సుమారు 50,60 ఏళ్ళక్రితం వరకూ సంపన్నులకు కాలక్షేప సాధనా లయిన నాట్య, గానాలను, అలాంటి కొన్ని కళలకు లేని పోని పవిత్రత, దివ్యత్వం అంటగట్టి అవి నాశనం అయిపోతున్నాయంటూ గగ్గోలు పెడుతూ, అకాడమీలు, సాగర్లు, సముద్రాలు స్థాపించి సొమ్ముచేసుకుంటున్న 'కల్చరల్ ఆక్టోపస్' లబారినుంచి అన్ని కళారూపాలను బయటపడెయ్యాలి. ప్రాచీన, చారిత్రాత్మక, సంప్రదాయ, చట్టుబండలు అనే శిధిలాల కింద కొన ఊపిరితో మూలుగుతున్న మెజారిటీ ప్రజల కళలను, సాధనాలనూ, విధానాలనూ వెలికితీసి, ఆదరణ అనే ఆక్సిజన్‌ను ఎక్కించాల్సిన అవసరమే నిజమైన చారిత్రక అవసరం.

మనలాంటి సామాన్యులకు అర్థంకాని భాష, భావాలు, విన్యాసాలు, వందలారీల తాటాకు పుస్తకాలు చదివితే తప్ప అంతుబట్టని మహాలావు గ్రంధరాజాలు, వాటికి వేయి పడగలతో కాపలాకాసే ఘనాపాఠీ గూర్ఖాలు. శాటిలైట్ టీవీలు బాహ్య శత్రువులయితే వీళ్ళంతా అంతర్గత శత్రువులు. ప్రచ్ఛన్న వేషాలతో, ఛప్పన్నారు ప్రాంతాల్లో సంచరిస్తున్న థగ్గులు, పిండారీలు, అఘోరీలు. ఈరెండు రకాల శత్రువులతో పార్టీ, సిద్ధాంత ప్రమేయం లేకుండా మనిషినన్న ఇంగితమున్న ప్రతి కవీ, రచయితా, కళాకారుడు, మేధావి అందరూ పోరాడాల్సిన తరుణమిది. ఈ పోరాటంలో 'అశోకచక్ర' వంటి పతకాలు లభించకపోవచ్చు. కానీ, ఆత్మ గౌరవాన్ని కాపాడుకోవటంలోని సంతృప్తి మిగులుతుంది. లేకపోతే బెంజిమన్ ఫ్రాంక్లిన్ చెప్పినట్టు కలిసికట్టుగా బతక్కపోతే విడివిడిగా ఉరికంబాలు ఎక్కాల్సి ఉంటుంది.

*గాంధీ యుగానికి అద్దంపట్టిన నవలాకారులు:*

# ఉన్నవ లక్ష్మీనారాయణ - ప్రేమ్ చంద్

- ఆర్. సుందరరావు

మహాత్మాగాంధీ నాయకత్వాన సాగిన భారత జాతీయ స్వాతంత్ర్య ఉద్యమం రాజకీయ, సాంఘిక రంగాలతో బాటు సాహితీ రంగాన్ని కూడా ఎంతో ప్రభావితం చేసింది. భారత జాతికి సుసంపన్న వారసత్వంగా సంక్రమించిన సామాజిక, సాంస్కృతిక విలువలను నిలుపుకుంటూనే ఆధునిక యుగం అవసరాలకు అనుగుణంగా నూతన మానవతా విలువలను స్వాయత్తం గావించుకొనడమే యీ యుగపు విశిష్టత. ఇట్టి సాహిత్యకారులలో గురుదేవ్ రవీంద్రనాధఠాకుర్, మహాకవి సుబ్రమణ్యభారతి, మహమ్మద్ ఇక్బాల్, కాజీనస్రుల్ ఇస్లాంల సరసన చేరదగిన మహారచయితలు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ ప్రేమ్‌చంద్ భారత ప్రజల జాతీయ విముక్తి ఆకాంక్షతోబాటు, పీడిత - తాడిత జనావళి వ్యధార్త జీవనానికి, వారిలో నిబిడీకృతమైవున్న పోరాటపటిమకు వీరిద్దరూ అద్దం పట్టారు.

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ ఆంధ్రబార్డోలీగా పేరుగాంచిన గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా వేములూరుపాడులో 1877లో ఒక సామాన్య ఉపాధ్యాయుని కుటుంబంలో జన్మించారు. భారత సాహిత్యాకాశంలో నవలా చక్రవర్తిగా వెలుగొందిన ప్రేమ్‌చంద్ 1880లో భారత ప్రజలకు పవిత్రతీర్థస్థానమైన కాశీ సమీపంలోని లమ్హీగ్రామంలో ఒక పోస్టల్ గుమాస్తా యింట జన్మించారు. దిగువ మధ్యతరగతి కుటుంబాలకు చెందిన యువతీయువకులు ఎదుర్కొనే అన్నికష్టాలను వీరిద్దరూ ఎదుర్కోక తప్పలేదు. వీరిద్దరూ ఉపాధ్యాయులుగానే తమ వృత్తిజీవనాన్ని ఆరంభించారు. ఉపాధ్యాయునిగా పని చేస్తూనే శ్రీ ఉన్నవ ప్రైవేటుగా 'లా' పరీక్ష పాసయ్యారు, శ్రీప్రేమ్‌చంద్ పట్టభద్రులయ్యారు.

భర్త అడుగు జాడలలో నడుస్తూ వారి ఉన్నతికి కారుకులైన ''ధర్మపత్నుల''ను పొందడం వారిద్దరూ చేసుకున్న అదృష్టం. సంపన్న కుటుంబానికి చెందిన లక్ష్మీబాయమ్మ తండ్రి అడ్డు చెప్పినా సరకు చేయక పట్టుబట్టి '' ఉన్నవ బావ''ను పెళ్లాడ్డంలో తన భావి ''సత్యాగ్రహ పటిమ''ను ప్రదర్శించింది. ఆయన అడుగు జాడలలో వితంతు పునర్వివాహ ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొని కులంనుండి వెలికి గురయింది, స్వాతంత్ర్య ఉద్యమంలో జైలుకెళ్లింది, హరిజన, దీన మహిళా జనసేవలో చరితార్థురాలయింది, మహాత్ముని నిర్మాణ కార్యక్రమాన్ని త్రికరణశుద్ధిగా ఆచరించింది.

చిన్నతనంలోనే వైధవ్యం పాలైన, సంపన్న కుటుంబానికి చెందిన శివరాణీదేవి ఏరికోరి ప్రేమ్‌చంద్ పాణిగ్రహణం చేసింది. ఆనాటి సాంఘిక కట్టుబాట్లను ధైర్యంగా ఛేదించింది. భర్తతోబాటు పేదరికాన్ని బుద్ధిపూర్వకంగా వరించింది. గాంధీజీ పిలుపుపై సహాయనిరాకరణ ఉద్యమంలో తాను ముందుగా జైలుకెళ్లింది. ప్రభుత్వ ఉద్యోగిగానున్న ప్రేమ్‌చంద్‌కు ధైర్యం చెప్పి ఆ ఉద్యోగానికి రాజీనామా యిప్పించింది. తన జాతి ప్రజల సరసన, పీడితజన పక్షపాతిగా కలమనే ఆయుధంతో నిర్భయంగా పోరేందుకు ప్రేమ్‌చంద్‌కు ఆచరణాత్మక స్ఫూర్తినిచ్చింది. అదేసమయంలో భర్తఅడుగు జాడల్లో తానూ రచయిత్రి అయింది. ''హోలీ బహుమానం'' అను ప్రేమ్‌చంద్ కథ యీ ఆదర్శదంపతుల ''మేడ్‌ఫర్ ఈచ్‌అదర్'' సూక్తికి సజీవ ప్రతీక.

1905-07 మధ్య సాగిన ''వందేమాతరం'' ఉద్యమంలో పాల్గొందుకై శ్రీ ఉన్నవ తన ఉపాధ్యాయ ఉద్యోగానికి రాజీనామా యిచ్చారు. ఉద్యమ ఉధృతి చల్లారాక పొట్టకూటికై కొంత కాలం పాటు కార్డ్అండ్‌కోలో క్యాషియరుగాను, మరికొంత కాలం పోస్టలు ఉద్యోగిగాను పనిచేయక తప్పలేదు. కాని జాతీయోద్యమ అభిమానం ఆయన్నీ ఉద్యోగాల్లో ఎక్కువ కాలం కుదురుగా ఉండనీయలేదు. బ్రిటీషు వలస వాదాన్ని ఎదిరించే వారందరికి వేగు చుక్కగా నున్న ఐర్లండు రాజధాని డబ్లిన్‌లో ''బారెట్లా'' చదివేందుకు వెళ్లారాయన. నల్లజాతి ప్రజలను కించపరిచే వ్యాఖ్యలు చేసిన లార్డ్ లాన్స్ బరేపబ్లిగ్గా క్షమాపణ చెప్పుకున్న దాకా వదలని జాతీయ ఆత్మాభిమానం శ్రీ ఉన్నవసొత్తు. అక్కడి ఫ్యాషన్ అయిన హేటును వదలి తలపాగా ధరించిన కల్తీలేని భారతీయత ఆయన సొంతం.

ఆ రోజుల్లో గోరఖ్‌పూర్‌లో ఉద్యోగం చేసుకుంటున్న శ్రీ ప్రేమచంద్ కలెక్టరు బంగళావున్న వీధిలో కాపురముండేవారు. ఆవీధిలో రోజూ వ్యాహ్యాళికెళ్లే కలెక్టరుకు అందరూ వంగివంగి సలాములు చేస్తున్నా ఉదయాన్నే తన రచనా వ్యాసంగంలో తల మునకలుగా ఉండే ప్రేమ్‌చంద్ ఆ కలెక్టరు రాకపోకలను అసలు పట్టించుకునేవాడేకాదు. అందుగ్గాను మందలించిన కలెక్టరుకు దారిన పొయ్యే ప్రతి తెల్లదొరకు వంగి సలాం చేయడంకంటె ముఖ్యమైన పనులనేకం నాకున్నాయ''ని గడుసుతనంగా జవాబివ్వగలిగిన దిట్ట శ్రీప్రేమ్‌చంద్.

శ్రీ ఉన్నవ బారెట్లా పూర్తి చేసి స్వదేశానికొచ్చి ప్రాక్టీసు పెట్టీపెట్టగానే గాంధీజీ సహాయనిరాకరణోద్యమ పిలుపురానే వచ్చింది. ఇంకేముంది, వెనుక ముందు ఆలోచించకుండా ప్లీడరీ వదిలేసి ఉద్యమంలోకి ఉరికారాయన. మరో 47 మంది గుంటూరు లాయర్లు ఆయన్ను అనుసరించారు. అయితే లాయరుగా తిరిగి కోర్టు ముఖం చూడని నిబ్బరం చూపింది శ్రీ ఉన్నవ ఒక్కరే. అదే విధంగా గోరఖ్‌పూర్‌లో 8.2.1921వ తేదీన గాంధీజీ ఉపన్యాసం విన్న శ్రీ ప్రేమ్‌చంద్ భార్యయిచ్చిన ఉతంతో తన ఊద్యోగానికి రాజీనామాయిచ్చారు. అనేకసార్లు పూటకూడు కరువైనా, రోగాలు రొప్పులు ఎన్ని ఎదురైనా తిరిగి ప్రభుత కొలువువైపు కన్నెత్తి చూడని ధీరోదాత్తుడు శ్రీప్రేమ్‌చంద్.

సహాయనిరాకరణోద్యమంలో భాగంగా గుంటూరుజిల్లా పలనాటి సీమరైతాంగం బ్రిటిషు ప్రభుత్వ అటవీ చట్టాలను ధిక్కరించి, పుల్లరి చెల్లించ నిరాకరించారు. రైతులను నయానా భయానా లొంగదీయడానికొచ్చిన కలెక్టరు షీల్డుదొరకు గ్లాసుడు మంచినీళ్లయినా యిచ్చేదిక్కు లేక పోయింది. అదీ వీర పలనాటి ప్రజలపై శ్రీ ఉన్నవ పట్టు. ఇందుగ్గాను ఆయనకు సంవత్సరం కఠినజైలు శిక్షపడింది. అదే తెలుగు సాహిత్యానికి వరప్రసాదమయింది. శ్రీ ఉన్నవ అలీపూర్ సెంట్రల్‌జైలులో వుంటూ 609 పుటలు ''మాలపల్లి'' నవలా రచనను పూర్తిచేశారు. జైలురచన అయినందున అధికారులు దీనిని సెన్సారు వారికి పంపారు. మద్రాసు ప్రభుత్వఅధికారి బి.యస్.యస్.రావు'' ఈ రచయిత సందర్భం ఉన్నా, లేకున్నా కావాలని కల్పించుకుని పోలీసు, జైళ్లు, కోర్టులు, క్రిమినల్ సెటిల్మెంటులు - ఒకటేమిటి అన్ని ప్రభుత్వ శాఖలను అదేపనిగా తూర్పారబట్టాడు. ప్రజలదృష్టిలో వాటిని చులకన జేయజూచాడు. అంతటితో ఆగక బోల్షెవిజాన్ని, సహాయనిరాకరణను ప్రబోధించి ప్రభుత్వంపైద్వేషాన్ని, అసహ్యాన్ని రెచ్చగొట్టడానికి పాల్పడ్డాడు. ఈ పుస్తక ప్రచురణ ఎనలేని చేటుతెస్తుంది'' అని రాశాడు. ఈ నవలను వెనువెంటనే ధ్వంసం

చేయమని మద్రాసు ప్రభుత్వం జైలు అధికారులకు అర్జంటు ఉత్తర్వు లిచ్చింది. అయితే కంసుని చేతి నుండి తప్పించుకున్న చిన్నికృష్ణుని వలె ''మాలపల్లి'' రెండవ ప్రతి జైలు గోడలు దాటి చేరాల్సిన చోటికి చేరింది.

గోరఖ్ పూర్‌లో ఉద్యోగం చేస్తున్న సమయంలో ప్రేమ్‌చంద్ నవాబ్‌రాయ్ అను కలం పేరుతో ''సోజేవతన్'' (మాతృభూమివేదన) కథాసంపుటిని వెలువరించారు. అందలి ''అమూల్యరత్నం'' (సబ్‌సే అన్‌మోల్‌రతన్) కథలో ఒక పాత్ర ప్రపంచంలో కెల్లా విలువైన వస్తువేదని ప్రశ్నిస్తుంది. ''మాతృదేశ విముక్తికై చిరునవ్వుతో ఉరికంబాన్ని కౌగలించుకున్న కొడుకు త్యాగాన్ని తల్చుకుని తండ్రి జాలు వార్చే కన్నీటి చుక్క'' అని ప్రేమ్‌చంద్ సమాధానం చెప్పిస్తారు. సర్కారు వేగుల ద్వారా యీ కథ రచయిత ఎవరో తెలుసుకున్న జిల్లా మేజిస్ట్రేట్ ప్రేమ్ చంద్‌ను పట్టితెప్పించి ''నీ విద్రోహపూరిత రచనలకు ఏమొగలాయిపాలనో అయితే నీరెండు చేతులూ తెగ్గొట్టించి వుండేవారు. నీ అదృష్టం కొద్దీ యిది బ్రిటిష్ పాలన. కాబట్టి బతికి పొయ్యావ్. ఇక ముందు యిట్టిరచనలు చేస్తే తగిన శిక్ష పడుతుందని'' హెచ్చరించాడు. దాని ఫలితంగా జరిగిందేమిటంటే అప్పటివరకు నవాజ్‌రాయ్ పేరుతో రచనలు చేసిన ధనపత్ రాయ్ ''ప్రేమ్‌చంద్'' అవతారమెత్తాడు. బ్రిటిష్‌పాలన, దోపిడీ దౌష్ట్యాలపై ఆయన రచనల్లో యీసడింపు, తిరుగుబాటు ధోరణి మరింత రాటుదేలాయి.

ఉన్నవ, ప్రేమ్‌చంద్ లిద్దరూ మౌలికంగా గాంధీ వాదులు. ఇద్దరూ కాంగ్రెస్‌లోని అతివాద ధోరణులవైపు మొగ్గుచూపారు. తిలక్ అనుచరులుగా రాజకీయ అక్షరాభ్యాసం గావించినవారు విదేశీ బానిసత్వంపోయి, పూర్తిరాజకీయ స్వాతంత్ర్యం సాధించనిదే నిజమైన సాంఘికసంస్కరణ సాధ్యంకాదని వీరిద్దరూ విశ్వసించారు. హిందూ సమాజం ఆమూలాగ్రం ప్రక్షాళనం కానిదే, కాలం చెల్లిన కట్టుబాట్లు, మూఢాచారులనుంచి భారతస్త్రీ బయట పడనిదే, మాయనిమచ్చగా మిగిలిన అంటరానితనం అంతంకానిదే అత్యధిక సంఖ్యాక భారత ప్రజలకు స్వరాజ్యమన్నది అర్థరహితంగా వుంటుందని వీరిద్దరూ త్రికరణ శుద్ధిగా నమ్మారు. అందుకే శ్రీ ఉన్నవ 1902లోనే ''ప్రార్థనా సమాజం'' ( ఆంధ్ర బ్రహ్మసమాజం) సభ్యునిగా వితంతు పునర్వివాహ ఉద్యమానికి, అస్పృశ్యతా నివారణకు నడుంబిగించారు. ఆ స్ఫూర్తితోనే బహుశా భారత దేశంలోనే ప్రప్రథమంగా ఒక ''హరిజనుడు కథానాయకుడుగా ఆంధ్రజాతి సగర్వంగా నాదని చెప్పుకోదగ్గ ''మాలపల్లి'' నవల రచించగలిగాడు. అదేవిధంగా ప్రేమ్‌చంద్ తన రెండవనవలను వితంతుపునర్వివాహ సమస్యా ప్రధానంగారచించాడు. తన ''సద్గతి'' కథలో ( ఇదే పేరుతో దీనిని సత్యజిత్‌రాయ్ దీనిని టి.వి. సినిమాగా తీశారు) హరిజనులపై సాగుతున్న దోపిడీ, అత్యాచారాలను నిర్దాక్షిణ్యంగా ఎండగట్టాడు. 1918-20 మధ్య ప్రేమ్‌చంద్ రచించిన ''ప్రేమాశ్రమ్'' నవలకు, 1921-22లో ఉన్నవ విరచిత ''మాలపల్లి''కి మధ్య ఎన్నో దగ్గర పోలికలున్నాయి. ఈ రెంటిపైన గాంధీ మహాత్ముని భావజాలం, రష్యా విప్లవప్రభావం ప్రగాఢంగావున్నాయి. ''బోల్షెవిజం సూత్రాలతో నేనిపుడు దాదాపుగా ఏకీభవిస్తున్నాన''ని ప్రేమ్‌చంద్ 1919లోనే ప్రకటించాడు. అదే విధంగా మద్రాసు ప్రభుత్వం జారీచేసిన అభియోగ పత్రానికి జవాబుగా శ్రీ ఉన్నవ ''కమ్యూనిజాన్ని ప్రచారం చేయడం, పెట్టుబడి దారీదోపిడీకి వ్యతిరేకంగా కార్మిక సమైక్యతను ప్రబోధించడం పాపమేమీ కాద''ని పేర్కొన్నాడు.

వీరిద్దరిపైన తాల్‌స్తాయ్, గోర్కీల ప్రభావం కూడా బలంగా వుంది. రైతుల, కూలీల మూగబాధను, సాంఘిక పీడనను, వారి ఆశలను, పోరాటాలను వీరిద్దరూ పూర్తి సౌహార్దంతో అర్థంచేసుకుని అనితర సాధ్యమైన రీతిలో చిత్రీకరించారు. వీరిద్దరూ ఆదర్శోన్ముఖ యధార్థ వాదాన్ని వరించారు. వీరిద్దరికీ గోర్కీపట్ల అపారగౌరవాదరాలుండేవి. తీవ్రఅస్వస్థతలో వుండికూడా, డాక్టరు సలహాను సైతం ధిక్కరించి ప్రేమచంద్ 19.6.1936న జరిగిన గోర్కీ సంతాపసభలో పాల్గొన్నాడు. రాసుకొచ్చిన ఉపన్యాసాన్ని చదువుతూ మధ్యలోనే కూలబడి పొయ్యాడు, దాంతో మరొకరు ఆప్రసంగాన్ని చదవాల్సివచ్చింది. శ్రీ ఉన్నవ గోర్కీనాటికను స్వయంగా అనువదించి, తన శారదానికేతన్ విద్యార్థుల చేత ప్రదర్శింపజేశాడు. గోర్కీ సంతాపసభలో ఆర్ద్రపూరిత సందేశమిచ్చారు.

ఉన్నవ, ప్రేమ్‌చంద్ లిరువురూ నిబద్ధత, నిమగ్నత గల లౌకిక వాదులు (సెక్యులరిస్టులు). 1908లో ఉన్నవ ''అక్బర్ కథ'' రచించాడు. తన మాలపల్లి రచనకు అక్బర్ కథ స్ఫూర్తినిచ్చిందని ఆయన స్వయంగా చెప్పుకున్నాడు. అక్బరు సాంఘిక రాజకీయ దృక్పథం నుండి స్వతంత్ర భారతావని గ్రహించాల్సింది ఎంతైనా వుందని ఆయన వక్కాణించారు. చాపకూటిసిద్ధాంతాన్ని ప్రబోధించిన బ్రహ్మనాయుడి ఎడ ఆయనభక్తిగురించి వేరుగా చెప్పనక్కరలేదు. మరో చెంప ప్రేమ్‌చంద్ తనకు హిందువులు-ముస్లింలు, హిందీ- ఉర్దూ రెండూ రెండుకన్నులని చెప్పుకున్నారు. అక్బరు చర్యలను ఎంతో ప్రస్తుతించారు. ఆయన రచించిన ప్రతినవలలోను ఒక ఉదాత్త ముస్లిం పాత్ర తప్పని సరిగా దర్శనమిస్తుంది. ఆలోచన, ఆచరణ - రెంటిలోనూ హిందూ-ముస్లిం సమైక్యతను అర్థం పడుతుంది.

వీరిద్దరూ కష్టభూయిష్టమైన, అతి సాదాజీవనాన్ని అనాయాసంగా వరించారు. ఆరోజుల్లోనే ఆల్వార్ సంస్థానాధీశుడు నెలకు రు.400/ - వేతనం, కారు, బంగళాలతో ఉద్యోగం యిస్తానంటే బ్రిటిష్‌ప్రభువులమోచేతి నీళ్లు తాగే వాడికింద తాను ఊడిగం చేయలేనని ప్రేమ్‌చంద్ నిరాకరించాడు. దేశభక్తి కర్తవ్యంలో భాగంగా ''మాధురి'' పత్రిక సంపాదకత్వాన్ని చేబట్టాడు. జాతీయ పత్రికల ఆర్థిక పుష్టిగురించి వేరుగా చెప్పవలెనా?'' నాకథలకు పురస్కారంగా 3-4 రూపాయల విలువ చేసే వాచీ ఒకటి, ఒకచెప్పుల జత పంపండ'' ని తన కథల ప్రచురణ కర్త శ్రీదయా నారాయణ్ నిగమ్‌కు రాసిన ఒక జాబులో ప్రేమ్ చంద్ కోరుకున్నాడంటే ఆయనపడిన ఆర్థిక బాధలు యిట్టే అర్థమవుతాయి. ప్లీడరీ వృత్తివదిలి సహాయనిరాకరణోద్యమంలో చేరుతున్నపుడు నాలుగు రాళ్లు వెనకేసుకున్నాక ఆ పని చేస్తే బాగుంటుందేమోనన్న మిత్రులసలహాకు జవాబుగా ''మాతృభూమిపడుతున్న బాధలముందు, పొందుతున్న అవమానాల ముందు నా దరిద్ర్యమే పాటిద''న్న మహామనీషి శ్రీ ఉన్నవ. శ్రీరాజ గోపాలాచారి యివ్వజూపిన యం. యల్. ఏ పదవిని సున్నితంగా నిరాకరించి, హరిజన మహిళాసేవకే తన జీవితాన్ని నిస్వార్థంగా అంకితం చేసుకున్న ధన్యజీవి ఆయన.

మానవతావాద పతాకాన్ని సమున్నతంగా ఎత్తిపట్టుకున్న యీసాహితీ మూర్తులిద్దరూ దాని కేనాడూ మలినాన్ని అంటనివ్వలేదు. వారు సమాశ్వాసించిన ఉన్నతాదర్శాలు మనకు ఏమాత్రం స్ఫూర్తినిచ్చినా వారి ఆత్మలు ఎంతో ఆనందిస్తాయి.

# స్త్రీ సమస్య - కొడవటిగంటి కుటుంబరావు దృక్పథం

- సి. హెచ్. రామమూర్తి

20వ శతాబ్దపు మొదటి అర్ధభాగంలో ఆంధ్ర దేశంలో సంఘ సంస్కరణ మరింత విశాల దృక్పథాన్ని అలవర్చుకుంది. 19వ శతాబ్దపు ఉద్యమంతో పోల్చినపుడు సామాజిక సమస్యలు, సంస్కృతికి సంబంధించి ఆంధ్రమేధావి వర్గం సరికొత్త ప్రశ్నలు లేవనెత్తింది. పితృస్వామ్యవ్యవస్థ, కుటుంబవ్యవస్థ, వివాహ వ్యవస్థ మొదలైన సామాజిక ఏర్పాట్ల పరిశీలన సాహిత్యంలో చోటుచేసుకుంది. అందులో ముఖ్యంగా పురుషాధిక్య సంస్కృతిలో స్త్రీపై జరుగుతున్న అణచివేత, స్త్రీ పురుష సంబంధాలలో అసమానతపై తీవ్రమైన చర్చ మొదలైంది. 1930-50ల మధ్య వచ్చిన కొడవటిగంటి కుటుంబరావు గారి సాహిత్యం స్త్రీ సమస్యపై చర్చను గాఢంగా ప్రతిబింబించింది. బ్రాహ్మణ మధ్య తరగతి చెందిన కుటుంబరావు ఆ తరగతిలో పేరుకుని ఉన్న ఫ్యూడల్ సంప్రదాయాలను, దురాచారాలను తన రచనల ద్వారా తీవ్రంగా ప్రశ్నించాడు.

బ్రిటిషు వలస పాలన తన అవసరాల మేరకో ఐనా ఫ్యూడల్ పునాదిని పాక్షికంగానైనా దెబ్బతీసి కొత్త పెట్టుబడిదారి సామాజిక పరిణామక్రమంలోకి దారులు వేసింది. ఈ నేపథ్యంలో పాత ఫ్యూడల్ సంప్రదాయాలు, ఆచారాలకు నూతనంగా పుట్టుకొస్తున్న హేతుబద్ధమైన ఆలోచనలు, ప్రజాస్వామిక విలువలకు మధ్య సంఘర్షణ తప్పనిసరి. కుటుంబరావు తన రచనలలో మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబాలలోని ఈ సాంస్కృతిక ఘర్షణను చిత్రిస్తూ, తన అభ్యుదయ దృక్పథంతో స్త్రీ అణచివేతకు వ్యతిరేకంగా నూతన విలువల కోసం ఎలా నిలబడ్డాడో పరిశీలించడం ఈ వ్యాసం ప్రధాన ఉద్దేశ్యం.

స్త్రీ అణచివేతకు పునాదిగా ఉన్న భూస్వామిక భావజాలాన్ని ప్రశ్నించిన గుడిపాటి వెంకటచలం తరువాత స్త్రీ సమస్యను ప్రధాన ఇతివృత్తంగా చేసికొని రచనలు సాగించిన మేధావి వర్గంలో కుటుంబరావు ముందు వరసలో నిలుస్తారు. ఇంకా చెప్పాలంటే ఆధిపత్య భావజాలాన్ని చలం కంటె కూడ మరింత శాస్త్రీయ దృక్పథంలో కుటుంబరావు ప్రశ్నించాడు. ఎందుకంటె భూస్వామిక భావాలు ఏవిధంగా, వలస పరిపాలనలో భాగంగా అభివృద్ధి చెందిన బూర్జువా భావజాలానికి దగ్గరగా వచ్చాయనే విషయాన్ని, వాటిమధ్య పరిణితి చెందిన సంబంధాన్ని ఎంతో విపులంగా విమర్శచేసింది కుటుంబరావు అనే చెప్పవలసి ఉంటుంది.

**పితృస్వామ్య వ్యవస్థ**

కొడవటిగంటి కుటుంబరావు తన మార్క్సిస్టు దృక్పథంతో స్త్రీ విముక్తి ప్రశ్నను లేవనెత్తాడు. 1948లో వ్రాసిన 'ఆడజన్మ' నవలలో సమాజంలో, కుటుంబంలో స్త్రీ యొక్క స్థానం గూర్చి విపులంగా చర్చించాడు. పితృస్వామిక వ్యవస్థలో, సమిష్టి కుటుంబ ఏర్పాటులో స్త్రీ ఎలా అణచివేతకు, నిరాదరణకు గురికాబడుతుందో ఆ నవలలో చూపెడతాడు. స్త్రీ ఇంటి చాకిరికి, శ్రమ దోపిడికి ఎలా గురవుతుందో ఇలా వివరిస్తాడు. ''నువు జీతం లేని నౌకరివి. నీకు 24 గంటల నౌకరి. శలవుల్లేవు నీకు. డాక్టరు సర్టిఫికెట్లు లేవు. ఫించను లేదు. 1 పితృస్వామ్య వ్యవస్థలో స్త్రీ ఇంటికి బంది అయిపోతుంది. గృహానికి పరిమితమైన స్త్రీ ఇంట్లో చేసే శ్రమకు విలువ లేకపోవడం వలన స్త్రీ జీవితం పురుషుడి దయా-దాక్షిణ్యాలపై ఆధారపడవలసిన పరిస్థితి కలుగుతుంది. కుటుంబరావు దృష్టిలో స్త్రీ ఇంటి శ్రమ వెట్టిచాకిరితో సమానమయినదని పై మాటల ద్వారా తెలుస్తుంది.

---

★ **సి. హెచ్ రామమూర్తి** కేంద్రియ విశ్వవిద్యాలయం. హైదరాబాదులో పరిశోధకులుగా ఉన్నారు.

పితృస్వామిక వ్యవస్థ యంత్రాంగలైన ఉత్పత్తి సాధనాలపై పురుషుల అజమాయిషి, పురుషాధిపత్య భావజాలాల ద్వారా స్త్రీ ఎలా అణగదొక్కబడుతుందో తెలియజేస్తాడు. పురుషాధిపత్యానికి స్త్రీకి మధ్య ఉన్న సంబంధాన్ని కొ.కు ఈ మాటల్లో చెపుతాడు. ''నీ పట్లా మేమంతా మతానుశాసకులమే. అందరమూ పెట్టుబడి దారులమే, అందరమూ గూండాలమే''.2 పురుషాధిక్య వ్యవస్థ భావజాల పరంగా స్త్రీ నడవడిని నిర్దేశించడమే కాకుండా స్త్రీ ఇంటి శ్రమకు విలువ లేకుండా చేసి దోపిడి చేస్తూ, వ్యక్తిగా స్త్రీని తన కంట్రోలులో ఉంచుతుంది. అదే స్త్రీ పితృస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా గళం ఎత్తిందో ఆ వ్యవస్థ ఆమెను నిర్దాక్షిణ్యంగా అణచివేయడానికి ప్రయత్నిస్తుంది. కొ.కు మాటల్లో చెప్పాలంటే ''ఎదురు తిరుగుతావు నీ సంగతి మేంచూస్తాం. నీకు గౌరవంగా బతికే ఆస్కారం లేకుండా చేస్తాం. నువు సంఘంలో తల ఎత్తుకు తిరగటానికి లేకుండా చేస్తాం''3

కుటుంబరావు పరిశీలనలోని స్త్రీ అణచివేత అదో విధంగా అణచివేతకు వ్యతిరేకంగా స్త్రీ తిరుగుబాటు అంశాలను మనం ఇటాలియన్ మార్క్సిస్టు ఆంటోనియో గ్రామ్సి రూపొందించిన 'ఆధిపత్యం' (హెజిమొని) సిద్ధాంత చట్రంలో చూద్దాం. తన భావజాలాన్ని ఉపయోగించి పితృస్వామిక వ్యవస్థ తన ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తున్న నూతన సంస్కృతిని నిరాకరిస్తుంది. పితృస్వామిక నీతి నూతన సాంస్కృతిక విలువలకు ప్రాతినిధ్యం వహించే తమ విముక్తి పథంలో భాగంగా నూతన విలువలను ప్రతిపాదించే స్త్రీలను నీతిమాలిన వారిగా ముద్రవేస్తుంది. ఒక వేళ స్త్రీ పురుషాధిక్య సంప్రదాయానికి విధేయత చూపిస్తే ఆధిపత్య సంస్కృతి ఆమెను 'సంస్కారి'గా గుర్తిస్తుంది. ఈ పనిని అది గతం నుండి ఎంపిక చేసిన సంప్రదాయాల సమర్ధన ముసుగులో చేస్తుంది.4 ఈ విధంగా ఆధిపత్య సంస్కృతి (ఇక్కడ పురుషాధిక్య సంస్కృతి) ఎల్లప్పుడూ తన ఆధిపత్యాన్ని నిలబెట్టుకోవడం కోసం ఆధిపత్య వ్యతిరేక ప్రత్యామ్నాయ సంస్కృతిని అణచివేయడానికి ప్రయత్నిస్తుంది. కొ.కు పితృస్వామిక వ్యవస్థ చుట్టు జరుగుతున్న ఈ సంక్లిష్టమైన సంఘర్షణను ఇతి వృత్తంగా తీసికొని బ్రాహ్మణ మధ్య తరగతి కుటుంబంలో ప్రబలంగా ఉన్న ఫ్యూడల్ సంస్కృతిని నిశితంగా విమర్శించాడు.

'పతిభక్తి' (1993) కథలో ప్రధాన పురుషపాత్ర, ద్వారా స్త్రీల పట్ల బ్రాహ్మణ తరగతిలో ప్రబలి ఉన్న పురుషాధిక్యనీతిని తెలియజేస్తాడు. '' ఆడవాళ్ళకు స్వేచ్ఛ ఇచ్చి కులక మనటానికి నా అంతరాత్మను నిలువునా చీల్చినా ఒప్పదు. వాళ్ళను ఖైదీల క్రింద ఉంచి ఒక కాలితో తొక్కి పెట్టకపోతే అమ్మా! 'స్త్రీ బుద్ధి ప్రళయాంతకహ' అన్నవాడు వెర్రివాడా''5 అదే కథలో కథానాయకునికి ఆధునికీకరణ పట్ల సానుభూతి ఉన్నప్పటికిని స్త్రీ స్వేచ్ఛ విషయం వచ్చేసరికి మాత్రం తన ఆధిపత్య భావజాలాన్ని వదలుకోలేడు. ఆ పాత్ర మాటల్లో చెప్పాలంటే ''క్రాపింగులు పెట్టుకోవటం మైలగుడ్డలతో భోజనం చెయ్యటం, ఇంకా శూద్ర వాళ్ళతో కలసి అఘోరించినా తట్టుకుంటాను గాని ఆడవాళ్ళకు స్వేచ్ఛ ఇవ్వటాన్ని మాత్రం ఒప్పుకోను''6

వేరొక మాటలో చెప్పాలంటే బ్రిటిషు వాళ్ళ ఆధునికీకరణ కట్టుబాట్లకు మారు పేరుగా ఉన్న బ్రాహ్మణ తరగతి జీవితాలలో కూడ కొన్ని ఆచారాలు, సాంస్కృతిక విలువలలో హేతుబద్ధమైన మార్పులు తీసికొచ్చింది. ఆ మార్పులు ఆ తరగతి మనుగడకు అవసరం కూడా. శూద్ర వాళ్ళతో కలసి భోజనం అయినా చేస్తాను గాని అన్న పై పాత్ర మాటల్లో ఈ మార్పు గోచరిస్తుంది. అయితే అదో సందర్భములో స్త్రీ స్వేచ్ఛ విషయం వచ్చేసరికి మాత్రం వీళ్ళ దృక్పథం ఫ్యూడల్ భావజాల అంచులను దాటి బయటకు రాలేదని కొ.కు బయటపెట్టాడు.

పితృస్వామ్య వ్యవస్థ యొక్క ఆధిపత్యం భావజాల పరంగా సామాజికంగా ఎలా సమర్థింపబడుతుందో కుటుంబరావు పరిశీలిస్తాడు. ఈ పురుషాధిపత్యం సమర్థన కేవలం పురుషులకు బయటి ప్రపంచంలో వారికున్న స్థానం వల్లనే కాక భావజాల పరంగా కూడా చేకూరుతుంది. హిందూ బ్రాహ్మణ సంస్కృతి స్త్రీని 'పాతివ్రత్యం' పేర కట్టుబాట్లలో ఉంచుతుంది. మరోవైపు ఈ పాతివ్రత్యానికే హిందూ మతం పకడ్బందిగా సమర్థన చేకూర్చుతుంది.

బ్రాహ్మణ సంస్కృతి సృష్టించిన ఈ 'పాతివ్రత్య' భావనను కొ.కు నిశితంగా ఖండిస్తాడు. కొ.కు రచనలలో సంప్రదాయ బ్రాహ్మణ పురుషపాత్రలు ఆచారాలు, సంప్రదాయాల యొక్క విలువలను నొక్కి చెప్పటం మనం గమనించవచ్చు. ఉదాహరణకు 'పతివ్రతా మహిమ' కథలో శివానందం ఇలా అంటాడు.

''ఈ సంఘ సంస్కరణ ముఖ్యంగా స్త్రీల విషయంలో ప్రక్కదారి పడుతుంది. మన సంప్రదాయాల్ని ఆచారాల్ని మంట కలుపుతుంది. మన సంఘం బాగు పడాలంటే మన స్త్రీలకు అనాదిగా వస్తున్న పాతివ్రత్యం కంటె వేరు మార్గం లేదు. మన పురాణ పతివ్రతలు తమ పతివ్రతా మహిమ చేత గొప్ప కార్యాలు సాధించారు. ఈనాడు కూడ పతివ్రతా ధర్మాన్ని మించిన శక్తిలేదు.''7

ఆధిపత్య భావజాలం కొన్ని ప్రత్యేకమైన విలువలను నొక్కి చెపుతూ సమాజంలో కొనసాగించటానికి ప్రయత్నిస్తుంది. ఇక్కడ 'పాతివ్రత్యం' అనేది పురుషాధిక్య భావజాలం సృష్టించిన సామాజిక విలువ తప్ప మరొకటి కాదు. ఈ 'పాతివ్రత్యం' అనే విలువ ప్రధాన ఉద్దేశ్యం స్త్రీ లైంగికత్వాన్ని పునరుత్పత్తిని పురుషుడు తన చేప్పుచేతుల్లో ఉంచుకోవడం తప్ప వేరే కాదు. ప్రసిద్ధ సాహితి విమర్శకుడు రేమండ్ విలియమ్స్ దృష్టిలో తన ప్రయోజనాలకు అనుగుణంగా 'ఎంపిక చేసిన సంప్రదాయలను' ప్రచారంలో పెట్టటం ద్వారా ఆధిపత్య సంస్కృతి తనను తాను సమర్థించుకుంటుంది.8

ఇక్కడ పురాణాల్లోని గొప్ప మహిమలు గల పతివ్రతల ఘనత అనేది ఆధిపత్య హిందూ బ్రాహ్మణ సంస్కృతి సృష్టించిన విలువ. ఈ ఎంపిక చేసిన విలువను, సంప్రదాయాన్ని 20వ శతాబ్దంలో కూడ నొక్కి చెప్పడం అంటె పురుషాధిక్య సమాజంలో స్త్రీ పరాధీనతను, స్త్రీ, పురుష సంబంధాల్లో అసమానతను సమర్థించడమే. సంప్రదాయాలు అనేవి వాటంతట అవే పుట్టుకురావు. ప్రతి యుగంలో కూడ ఆధిపత్య వర్గాలు తమ ప్రయోజనాలను పరిరక్షించడానికి సంప్రదాయాలను జాగ్రత్తగా నిర్మించి అమలులో పెడతాయి. ఆధునిక కాలంలో బ్రాహ్మణ తరగతి గతం నుండి ఆధిపత్య సంప్రదాయమైన 'పాతివ్రత్యాన్ని' ఎంపిక చేసి దాని అవసరాన్ని తమ కుటుంబంలో స్త్రీలకు నొక్కి చెప్పడాన్ని మనం పై క్రమంలోనే అర్థం చేసికోవాలి.

సమాజంలో ఆధిపత్యంలో ఉన్న వర్గాలు నిర్మించిన ఆచారాలను కొ.కు విమర్శకు పెట్టాడు. అదే విధంగా సమకాలీన సంస్కృతిపై తమ ఆజమాయిషి సమర్థించుకోవడానికి గతంలో రూపొందించిన ఆధిపత్య సంప్రదాయాల, విలువల పునరుద్ధరణ కోసం ప్రయత్నించే సామాజిక శక్తులకు కొ.కు బద్ధవ్యతిరేకి. అందుకే పాతివ్రత్యం సంప్రదాయం పరిరక్షణ పేర సమాజంలో, కుటుంబంలో ఉన్న అణచివేతను ఆ అణచివేతకు వ్యతిరేకంగా స్త్రీ చేసిన తిరుగుబాటును కుటుంబరావు తన 'స్వేచ్ఛ' కథలో చిత్రించాడు. కథలో ప్రధాన స్త్రీ పాత్ర కుటుంబ సభ్యులు కుదిర్చిన వివాహం చేసికొని కాపరానికెళుతుంది. ఐదు సంవత్సరాల పాటు అత్తవారింట్లో

వారందరికి వెట్టిచాకిరి చేస్తుంది. ఈ ఐదు సంవత్సరాల తన దాంపత్య జీవితంలో ఏ ఒక్కరోజు కూడ ఇంట్లో వారు తను కూడ ఒక మనిషినని, తనకు ఒక మనసు ఆత్మాభిమానం ఉంటాయని గ్రహించరు. తనను బానిస కంటె హీనంగా చేసిన పాతివ్రత్య భావనను ధిక్కరించి ఆమె తనంటె ఇష్టపడే శేషాచలంతో వెళుతుంది. ఈ సంఘటన ఆమె రక్త సంబధీకులు, బంధువుల్లో తీవ్ర అలజడిని రేపుతుంది. ఈ సందర్భములో కుటుంబరావు ఆ స్త్రీ పాత్ర ద్వారా పితృస్వామ్య వ్యవస్థలో పాతివ్రత్యం పేర కుటుంబంలో ఉన్న శారీరక, మానసిక, లైంగిక అణచివేతను ప్రశ్నిస్తాడు. అదే విధంగా స్త్రీ పురుష సంబంధాలలోని అసమానత స్త్రీని ఒక వ్యక్తిగా ఎలా అణచివేస్తుందో లోతుగా చర్చిస్తాడు. సంప్రదాయాన్ని ధిక్కరించి ఇంతవరకూ ఆమెపై తమకున్న ప్రేమను మంటకలిపిందని పుట్టింటివారు పై 'స్వేచ్ఛ' కథలో ఆమెపై ఆక్రోషిస్తారు. ఈ సందర్భములో ఆమె ఇలా అంటుంది. ఒక తుచ్ఛమైన ప్రేమ కోసం అందరి ప్రేమలు మంట కలిపావు అంటాడే మా అన్న - నాకు శేషాచలం మీద ఉన్న ప్రేమకు మా అన్నగారికి నా మీద ఉండే ప్రేమకు వైషమ్యం ఏమిటి?9 అని ప్రశ్నిస్తుంది. అదే విధంగా తమ పరువు తీసేసిందని తనను దూషించిన బంధువ్వులను 'వారి పరువు' ప్రతిష్టల కోసమే నేను భువిలో అవతరించాననే భ్రమ వారికి ఎందుకు కలిగిందో నేను యేమాత్రము ఊహించలేకుండా ఉన్నాను.10 అని త్రిప్పికొడుతుంది. అంటే ఇక్కడ స్త్రీ-పురుష సంబంధాల్లో ఉన్న అసమానత స్త్రీని ఒక వ్యక్తిగా గుర్తించక ఆమె వ్యక్తిత్వాన్ని, స్వేచ్ఛను హరించి ఆమె జీవితాన్ని నిర్దేషిస్తుంది. ఈ ఆధిపత్య స్త్రీ - పురుష సంబంధాలనే కొ కు ప్రశ్నించాడు. అదే విధంగా భార్య వ్యక్తిత్వాన్ని మనస్సును హరించి ఆమెను తన లైంగిక అవసరాలు తీర్చే యంత్రంగా భావించిన భర్తను ధిక్కరించి, ఈ లైంగిక అనుభవం హేయమైనదని భావించి స్వేచ్ఛ కోసం, వ్యక్తిత్వం కోసం పరితపించిన ఉదాత్తమైన స్త్రీ పాత్రను కొ.కు ఈ కథలో సృష్టించాడు. కొ.కు వివాహ వ్యవస్థలో స్త్రీ పురుషులు కృత్రిమమైన భార్య భర్తల బంధానికి కట్టుబడి ఉంటున్నారు కాని ప్రేమ బంధానికి కాదు అంటాడు. అందుకే సమాజంలో కుటుంబంలో స్త్రీ వ్యక్తిత్వాన్ని నిరాకరించి, స్త్రీ పురుష సంబంధాల్లో అసమానతకు సమర్ధన చేకూర్చే, 'పాతివ్రత్య,' భావజాలాన్ని ప్రశ్నించి స్త్రీ స్వేచ్ఛ ప్రశ్నను లేవనెత్తాడు.

స్త్రీ - పురుష సంబంధాల్లో లైంగిక సమస్యను ఒక ప్రధాన సమస్యగా సాహిత్యంలో చర్చకు పెట్టిన చలం తరువాత మరింత విస్తృతంగా, విశాలదృక్పథంతో ఆ సమస్యను కుటుంబరావు చర్చించాడు. పురుషాధిక్య సమాజంలో లైంగికసమస్యను ముఖ్యంగా బ్రాహ్మణ సంస్కృతి, కుటుంబంలో వితంతువులపై అమానుషమైన లైంగిక అణచివేతను కొ.కు తన 'అరణ్యం' 'ఒంటి స్తంభం మేడ' కథలలో విపులంగా చర్చించాడు. బాల్య వివాహాల ద్వారా స్త్రీకి వైధవ్యం ప్రసాదించి వితంతు సమస్యను ఒక ప్రధాన సమస్యగా బ్రాహ్మణ సంస్కృతి సృష్టించింది. అదే సంస్కృతి వితంతువును అతిహేయమైనకట్టుబాట్లలో ఉంచి, ఆమెకు పునర్వివాహాన్ని నిరాకరించి తన పురుషాధిక్య నీతిని అమలు చేసింది. ఇక్కడ మనం రెండు విషయాలు అర్ధం చేసికోవాల్సి ఉంటుంది. దైనందిన జీవితంలో వితంతు స్త్రీ నడవడిని కట్టుబాట్లతో నిర్దేశించడం ఒక పార్శ్వంకాగా రెండవది ఆమె ప్రకృతి సహజ సిద్ధమైన లైంగిక అవసరాన్ని నిరాకరించడం. లైంగిక విషయం కేవలం ప్రకృతి సహజ సిద్ధమైనదే కాకుండా సాంస్కృతికమైనది కూడ అయినప్పటికిని ఆసంస్కృతి ఎవరి ఆధిపత్యంలో ఎవరి ప్రయోజనాలకు అనుగుణంగా స్త్రీ లైంగికత్వాన్ని నిర్దేశించింది అనేది ముఖ్యం. ఇక్కడ పురుషాధిక్య లక్షణం కల బ్రాహ్మణ సంస్కృతి స్త్రీ లైంగిక

అవసరాలను ఎలా ఉండాలో శాసించింది. వితంతువు విషయంలో ఈ అవసరాన్ని పూర్తిగా నిరాకరించి లైంగిక అణచివేతను మరీ వికృతంగా అమలు జరిపింది.

లైంగిక అవసరాల విషయంలో స్త్రీ మనోభావాలు ఎలా ఉండాలో నిర్ణయించిన బ్రాహ్మణ పురుషాధిక్య నీతిలోని అమానుషత్వాన్ని, ఆత్మ వంచనను కుటుంబరావు తన 'అరణ్యం' కథలో చూపెడతాడు. కథలో 50 ఏళ్ళ వయస్సులో 15 ఏళ్ళ పిల్లను రెండో పెళ్ళి చేసికొని, ఇంకొకవైపు వంటలక్కతో అక్రమ సంబంధం కొనసాగించే ఒక బ్రాహ్మణ తండ్రి చిన్న తనంలో విధవరాలైన తన కూతురు లైంగిక అవసరాలు, సుఖ తాపత్రయాన్ని గుర్తించ నిరాకరిస్తాడు. 'కూతురుకు రెండో పెళ్ళి చేయరాదా!' అని రెండో భార్య అడిగితే ''నా చేతి మీదుగా నేను చెయ్యను. మొగుడు కావాల్సి వచ్చినపుడు ఎవరితోనో చెప్పకుండా లేచి పోతుంది. పాపము పుణ్యము నాకక్కరలేదు. నేనటువంటి పనులు చేసి నలుగురి చేత తప్పు పట్టించుకోను''11 అంటాడు. ఈ పరిస్థితిలో కూతురు ఎదురింటి వాడితో లేచిపోగా రెండో భార్య తన మనస్సును అర్థం చేసికొని, తనను ప్రేమిస్తున్న, వయస్సులో తనకు తగిన వాడైన తన సవతి కొడుకుతో లేచి పోతుంది.

కుటుంబరావు ఈ కథ ద్వారా ఆత్మ వంచన పరమావధిగల మధ్య తరగతి బ్రాహ్మణ సంస్కృతి శృతి మించితే ఎలా బద్దలవుతుందో నిరూపించాడు. అదే విధంగా భారతీయ బ్రాహ్మణ కుటుంబ క్షుద్ర సంస్కృతిని బట్టబయలు చేశాడు.

పురుషాధిక్య బ్రాహ్మణ సంస్కృతిలోని వివాహవ్యవస్థ, కుటుంబ వ్యవస్థ స్త్రీని ఎలా అణచివేశాయో శాస్త్రీయంగా బహిర్గతం చేసికొ. కు స్త్రీని పట్టి బంధించే ఫ్యూడల్ సంప్రదాయపు చట్రాన్ని బద్దలు చేయాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పాడు. అదే సందర్భములో స్త్రీ - పురుష సంబంధాల్లో అభ్యుదయమైన విలువలు ప్రతిపాదించాడు. కొడవటిగంటి కుటుంబరావు దృక్పథంలో స్త్రీ-స్వేచ్ఛకు స్త్రీ - పురుష సమానత్వం దిశలో సామాజిక మార్పు తప్పని సరి.

1. ' ఆడజన్మ' నవల కేతువిశ్వనాథరెడ్డి (సంపా)
కుటుంబరావు సాహిత్యం Vol. IV, విశాలాంధ్ర, విజయవాడ, 1984, పేజి. 215
2. 'ఆడజన్మ' నవల పేజి. 216
3. 'ఆడజన్మ' నవల పేజి. 216
4. Raymond williums, Marxism and Literature Oxford University Press, London, 1989, P.113.
5. 'పతిభక్తి' కథ, కేతు విశ్వనాథ రెడ్డి (సంపా) కొడవటిగంటి కుటుంబరావు కథలు Vol. I, విశాలాంధ్ర, విజయవాడ, 1985, పేజి.62.
5. 'పతిభక్తి' కథ పేజీలు 61-62
7. కేతు విశ్వనాథరెడ్డి (సంపా) కుటుంబరావు సాహిత్యం Vol. V విశాలాంధ్ర, విజయవాడ, 1992, పేజి. 259
8. Raymond Williums, Op. Cit, P.113.
9. 'స్వేచ్ఛ' కథ, కేతు విశ్వనాథరెడ్డి (సంపా) కుటుంబరావు సాహిత్యం Vol.IV, పేజి.281
10. 'స్వేచ్ఛ' కథ, పేజి. 283.
11. 'అరణ్యం' కథ కేతు విశ్వనాథరెడ్డి (సంపా) కుటుంబరావు సాహిత్యం Vol. IV పేజి.346

# బిలియన్స్ అండ్ బిలియన్స్

- ఎన్. ఇన్నయ్య.

కార్ల్ శాగన్ రాసి, అచ్చుకాక పూర్వమే చనిపోయిన చివరి పుస్తకం బిలియన్స్ అండ్ బిలియన్స్ యిప్పుడు విడుదల చేశారు. ఆయన భార్య చివరి మాట జోడించి, పాఠకులను ద్రవింప జేసే మమత చూపారు. కార్ల్ శాగన్ మరణానంతరం ఆమె అందుకున్న లక్షలాది సానుభూతి లేఖలను బట్టి. శాగన్ బ్రతికే వున్నాడని డ్రుయన్ రాశారు.

శాగన్ ఇతర పుస్తకాలవలె యీ చివరి గ్రంథం కూడా జీవితం, మరణం, భవిష్యత్తు గురించి రాయగా, విపరీతంగా జనాకర్షణ పొందుతున్నది. సైన్స్‌ను, మానవాళికి సాంకేతిక రంగ ప్రమాదాలను, నివారణను శాగన్ అతి సున్నితంగా చర్చించి, మార్గాంతరాలను చూపడం యిందలి ప్రత్యేకత.

రెండవ అధ్యాయం ఎత్తుగడలోనే చదరంగం కథను స్వీకరించారు. తొలుత యిదికనుగొన్న పర్షియ మంత్రి అద్భుత చర్యకు రాజు ఆకర్షితుడై, ఏంకావాలని కోరుకోమన్నాడట. 64 గడులకూ మొదటిగడికి ఒక గోధుమ గింజతో మొదలెట్టి, రెట్టింపు చేసుకుంటూ పోయి, 64వ గడికి ఎంత ధాన్యం వస్తే అంత యిప్పించమని మంత్రి అడిగాడట. అదేం కోరిక! డబ్బు, స్త్రీలు, భవనాలు, ఆస్తులు, అలాంటివి కోరుకోమన్నాడు రాజు. మంత్రి వినయంగా తానడిగింది యిప్పిస్తే చాలన్నాడట. సరేనని, లెక్క మొదలెడితే, మొదటి గడికి ఒక గోదుమ గింజ రెండవ గడికి రెండు, మూడో గడికి 4, అలా హెచ్చిస్తూ పోయారట. 64వ గడి వచ్చేసరికి రాజుగారి ధాన్యాగారం చాల లేదు సరిగదా, అప్పు పడి, రాజ్యం అప్పగించాల్సి వచ్చిందట.

ఈ ఉదాహరణను శాగన్ పేర్కొని భారత దేశంలో కూడా లెక్కలు కనిపెట్టిన ఖ్యాతి ప్రస్తావించారు. ఆ లెక్కలు మన జనాభాకు అన్వయిస్తే ఎంత ముంచుక పోయే స్థితి వస్తుందో చూడమన్నారు.

వాతావరణ కాలుష్యాన్ని గురించి శాగన్ రాసింది మరీ ఆకర్షణీయంగా, హెచ్చరికగా బాగా వున్నది. ప్రపంచం యావత్తూ కాలుష్యానికి తోడ్పడుతుండగా అందులో అమెరికా 20 శాతం అందిస్తున్న విషయం గుర్తు చేశారు.

భూమికి 25 కిలో మీటర్ల ఎత్తులో వున్న ఓజోన్ పొరకు బెజ్జం పడింది. అంటార్కిటికా వద్ద తొలుత సైంటిస్టులు యిది కనుగొన్నారు. అయితే ఏమిటి? సూర్య రశ్మిలో వుండే అల్ట్రావైలేట్. కిరణాలు సూటిగా మన మీద పడతాయి. కాన్సర్ వంటి రోగాలకు దారి తీస్తుంది. శరీరానికి వుండే రోగనిరోధక శక్తి పోతుంది. ఓ జోన్ పొరకు బెజ్జం పడడానికి కారణం మనమే. క్లోరో ఫ్లూరో కార్బన్ల వాడటం వలన యీ ప్రమాదం ఏర్పడింది. మనం వాడే రిఫ్రిజిరేషన్, సెంట్లు, అనేక పరిశ్రమలలో వాడే స్ప్రేలు, ఇన్సు లేషన్, సాల్వెంట్స్‌లో యిది వున్నది. ఇందులో కణాలు ఆకాశంలో ఓ జోన్‌పొరలోని కణాల్ని ఎదుర్కొంటున్నాయి. అదే ప్రమాదం. భవిష్యత్తులో యీ ప్రమాదం యింకా పెరిగిపోతుంది. శాస్త్రజ్ఞులు హెచ్చరిస్తే, తొలుత పారిశ్రామికులు నిరోధించారు. తరువాత ఒప్పుకొని, వీటి వాడకాన్ని తగ్గించడానికి అంగీకరించారు. పూర్తిగా వీటిని ఆపడానికి కొంత కాలం పట్టవచ్చు. కాని ఆపి తీరాలని, భవిష్యత్తు తరాల సంక్షేమ

★ **డా. యన్. ఇన్నయ్య** ప్రముఖ పాత్రికేయులు. ప్రస్తుతం అమెరికాలో ఉన్నారు.

కారుడుగా కార్ల్‌శాగన్ స్పష్టం చేశారు. 'ఏ పీస్ ఆఫ్ స్కై యీజ్ మిస్సింగ్' అని ఈ అధ్యాయానికి చక్కగా శీర్షిక పెట్టారు.

సైన్స్ - మతం గురించి కార్ల్‌శాగన్ చేసిన చర్చ ఉత్తేజ పూరితంగా, మానవ వాదంతో నిమిడివున్నది.

రాజ్యాధి పతులు, మతాధిపతులు ఏర్పరచిన సంయుక్త సమావేశాలు 1988 ఏప్రిల్‌లో ఆక్స్ ఫర్డ్‌లోనూ, 1990 జనవరి మాస్కోలోనూ జరిగాయి. అందులో పాల్గొన్న శాస్త్రజ్ఞుడుగా శాగన్ తన అనుభవాల్ని రాశారు. వాతావరణకాలుష్యాన్ని ఆపి, భూమిని కాపాడు కోవాల్సిన బాధ్యత గురించి ఒక విజ్ఞప్తి చేయగా దానిపై మతాల వారు, రాజకీయ నాయకులు ఒడం బడికపై సంతకాలు చేశారు. అందుకే యీ విషయంలో మతం - శాస్త్రం చేరువ అయ్యాయని శాగన్ రాశాడు. ఆ సందర్భంగా ఒక ఆసక్తి కర విషయం ప్రస్తావించాడు.

వివిధ మతాలవారు సమావేశంలో ప్రార్థనలు చేశారు. అలాగే భారత వేద పండితుడు ఓం మంత్రాన్ని ఉచ్ఛరించగా అది అందరూ అనుకరించారట. సోవియట్ విదేశాంగ మంత్రి షెవర్‌నాట్జికూడా అందులో చేరి ఓం పఠనం చేశాడట. కాని గొర్బచేవ్ మాత్రం మౌనం. దాల్చాడట. ఆయన వెనకే లెనిన్ విగ్రహం వున్నది.

'మనశత్రువులు' అనే అధ్యాయంలో ఇంకో విశేషాన్ని శాగన్ బయటపెట్టారు. అమెరికా రష్యాలు శాగన్ వ్యాసాన్ని ఒకేసారి ప్రచురించాయి. అమెరికాలో పెరేడ్ పత్రిక. రష్యాలో ఓగోన్యాక్ (Ogonyak) ఈ వ్యాసాన్ని ప్రచురించి చర్చకు పెట్టారు. 1988లో జరిగిన విశేషం యిది. మనకు వేరే ప్రపంచాలనుండి ఎవరో వచ్చి దాడి చేసే ప్రమాదం లేదనీ, మనం సహజ వనరులను తగలేయడం ప్రమాదం వుందనీ, బొగ్గు తగలేసి కార్బన్ డయాక్సైడ్ పెంచి, వాతావరణం వేడెక్కేటట్లు చేస్తున్నామని శాగన్ హెచ్చరించారు. అమెరికా - రష్యాలు యిది ఆపితే, ఎడారులుగా కొన్ని ప్రాంతాల మారిపోకుండా వుంటాయన్నారు.

నిజం గురించి అటు అమెరికాకు గాని, యిటు సోవియట్ యూనియన్‌కు గాని గుత్తాధి పత్యం లేదని శాగన్ అన్నారు.

ఆ సందర్భంగా లెనిన్ మాటల్ని శాగన్ ఉదహరించారు. సోవియట్ యూనియన్‌లో శాగన్ వ్యాసంలోని భాగాలను, లెనిన్‌పై వ్యాఖ్యలను సెన్సార్ చేశారు. ఇప్పుడు తమదే తప్పు అని, లెనిన్ ప్రస్తావన చేసిన శాగన్ సరిగానే ఉదహరించాడని అర్బటోల్ తన స్మృతులలో ప్రకటించారు.

గర్భస్రావంపై చర్చించిన అధ్యాయంలో జీవనాన్ని హత్య చేయడం అంటే ఏమిటనే విషయంపై శాగన్ సునిశిత ప్రశ్నలు వేశారు. ప్రతి మనిషి రేతస్సులో భూమిని నింప గల శక్తి వున్నదనీ, రేతస్సు వృధా అవుతుంటే, అదంతా హత్యగా పరిగణించాలా అన్నారు.

ప్రపంచ సంక్షేమనిమిత్తం ఇస్లాం కూడా కుటుంబ నియంత్రణ పాటించాలని సిరియాకు చెందిన గ్రాండ్ ముఫ్తి 1990 ప్రపంచ సభలో చెప్పడం అందరినీ ఆకట్టుకున్న విషయం శాగన్ జ్ఞప్తి చేశారు.

మరణాన్ని సహజంగా స్వీకరించిన శాగన్ తన గొప్పతనాన్ని యీ గ్రంథంలో చూపాడు.

సైన్స్‌ను సామాన్యులకు అందించిన శాగన్ శ్లాఘనీయుడు.



‘నాకు శిల్ప భౌతిక ఈతి బాధల ప్రపంచంనుంచి పలాయనం చేయవీలైన ఒక క్షేత్రం. కొంతసేపు అందులో విహంగ యానం చేస్తాను. మరికొంతసేపు అందలో నులి వెచ్చదనాన్ని అనుభవిస్తాను,’’ అంటారు శిల్ప శంకర్ ఘోష్.

MISIMI/మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd. No. H/SD/191.




Wole Soyinka

*"who, in a vast cultural perspective enriched with poetic resonances, stages a dramatic representation of existence"*

1986 Nobel Prize in Literature